


# వేదాంతాది పారిభాషిక పదకోశము

## ( సంఖ్యానుక్రమణిక )




సంకలన కర్త :
ఆచార్య తురగా సోమసుందరం
M. Sc. (Ag). M. S. (Ext. Edn.) (U.S.A.)



పరిష్కర్త :
విద్యా-భాషాప్రవీణ
డా. మూలంపల్లి చంద్రశేఖర శర్మ
M. A. (Sanskrit.) M.A, (Telugu), Ph.D.,

గీతా జ్ఞాన సేవా సమాజము
మాధవనగరు, హైదరాబాదు
1992

వేదాంతాది పారిభాషిక పదకోశము

ప్రథమ ముద్రణము

ఫిబ్రవరి, 1992

ప్రతులు : 500





ప్రతులకు

టి. సోమసుందరం,

గీతా జ్ఞాన సేవా సమాజము,
16-2-836/సి/5, మాధవనగర్,
సైదాబాదు, హైదరాబాదు-500659.

వెల : రూ. 25-00

ముద్రణ : శ్రీలక్ష్మి ప్రింటర్స్, దయానంద కూరగాయల మార్కెట్,
మాదన్నపేట, హైదరాబాదు-500 659

# గీతా జ్ఞాన సేవా సమాజము

మాధవనగరు, హైదరాబాదు.

స్థాపన : నవంబరు, 1979

లక్ష్యములు : 1. భగవద్గీత మొదలైన ఆధ్యాత్మిక గ్రంథముల సందేశ ప్రచారము.

2. పండితులచే ఉపన్యాసములు, జ్ఞానులచే ప్రవచనముల ఏర్పాటు.

3. పుస్తక ప్రచురణ.

4. ఇతర సేవా, సాంస్కృతిక కార్యక్రమముల నిర్వహణ.

నిత్యకార్యక్రమములు : ఆదివారము సత్సంగము, మంగళ గురువారములలో సద్గ్రంథ పఠన, ఏకాదశినాడు భజన, పర్వదినాలలో ప్రత్యేక కార్యక్రమాలు మొదలైనవి.

ప్రచురణలు :

1. హిందూ ధర్మపరిచయము - కర్మ
2. హిందూ ధర్మపరిచయము - భక్తి
3. హిందూ ధర్మపరిచయము - జ్ఞానము
4. తత్త్వబోధ
5. మణిరత్నమాల - ప్రశ్నోత్తరములు
6. భగవద్గీతోక్తులు
7. భజనావళి
8. వేదానుశాసనము
9. వేదాంతాది పారిభాషిక పదకోశము

(సంఖ్యానుక్రమణిక)

శాస్త్ర విశారద, బ్రహ్మవిద్యాలఙ్కార,
సూరి రామకోటిశాస్త్రి
Retired Principal,
K. L. N. Sanskrit College, Tenali.

1-10-219, అశోక్‌నగర్,
హైదరాబాదు.

## ఆశీస్సులు

శ్రీ తురగా సోమసుందరం మహాశయులచే సంకలనము చేయబడిన వేదాన్తాది పారిభాషిక పదకోశమును చూచి సంతుష్టాన్తరంగుడనైతిని. వారు ప్రభుత్వాధికార బాధ్యతలను నిర్వర్తించు కాలమున గూడ తత్త్వజిజ్ఞాసువులై యధ్యాత్మ వ్యాసంగ మును శ్రద్ధతో నాచరించుచు వేదాన్తశాస్త్ర పారిభాషిక పదముల యర్థమును గ్రహిం చుటకు శ్రమపడినట్లు తోచెడిని. ఇతరులకు అట్టి శ్రమ కలుగకుండ వేదాన్త శాస్త్రీయ విషయములను సులభశైలిలో పాఠక లోకమునకు "పారిభాషిక పదకోశము" అను నామముతో అందించుచున్నారు. ఈ పదకోశ సహాయముతో జటిలమైన విషయము లనుగూడ పాఠకులు గ్రహింపగలరు.

ఏక-ద్వి-సంఖ్యలతో ప్రసిద్ధములైన వానిని, ఇతిహాస పురాణ ధర్మశాస్త్రము లందు కూడ వ్యవహరింపబడిన వానిని సేకరించిరి. అష్టాచత్వారింశత్-అశీతి-అష్టో త్తరశత-సంఖ్యలతో ప్రసిద్ధములైన వానిని నిర్దేశించి ముగించిరి.

ఈ గ్రంథము చక్కగా జ్ఞానమును సంపాదించుటకు ఉపయోగించును. ఆధ్యా త్మిక జ్ఞాన వికాసమునకు మిక్కిలి తోడ్పడును. ఇట్లే శ్రీ తురగా సోమసుందరంగారు ఆధ్యాత్మిక వ్యాసంగము జేసికొనుచు జ్ఞానామృతమును సత్సంగముతో జిజ్ఞాసువులైన వారికి ఆస్వాదింపజేసి, తాము తరించుచు సమస్త జనులను తరింపజేయుదురు గాక !

ఈ గ్రంథము బహుళ వ్యాప్తినందు గాక !

పరమేశ్వరుడు వారిని చిరాయురారోగ్యైశ్వర్యములతో రక్షించుగాక !

సూరి రామకోటిశాస్త్రి
10-2-92

వేదాంత శిరోమణి, వేదాంత విశారద, విద్వాన్
డా. పుల్లెల శ్రీరామచంద్రుడు,
M. A. Ph. D (Sanskrit), M. A.,
(English), M. A. (Hindi),
Recipient of Presidents' Certificate of Honour,
Professor of Sanskrit, O. U. (Retd).

Nandanam,
7-1-32/4 P. 2. Leelanagar,
Begumpet,
Hyderabad-500016.
Date 6-2-1992

# ప్రశస్తి

శ్రీః

లౌకిక కార్యనివృత్తులైన శ్రీ సోమసుందరంగారు దాదాపు పది సంవత్సరాలుగా ఆధ్యాత్మిక సాధనా నిరతులై తాము పఠించిన ఉత్తమ గ్రంథములలోని విషయాలను గీతాజ్ఞాన సేవా సమాజం ద్వారా ఇతర జిజ్ఞాసువులకు కూడా పంచి యిచ్చుచున్నారు. ఇది ప్రతి ఒక్కరూ, ప్రతిదినమూ, ఏదో కొంత సమయము వెచ్చించి చేయవలసిన "జ్ఞానాభ్యాసము".

తచ్చిన్తనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్
ఏతదేక పరత్వంచ జ్ఞానాభ్యాసం విదుర్బుధాః

(ఆత్మను గూర్చియే చింతించడము, దానిని గూర్చియే చెప్పడము, పరస్పరము దానిని గూర్చియే ఒండొరులు బోధించుకొనడము, తదేక దృష్టితో ఉండడము అనేది "జ్ఞానాభ్యాసము" అని పండితులు చెప్పుదురు) అని లఘువాసిష్ఠము చెప్పుచున్నది. ఇట్టి జ్ఞానాభ్యాసవ్యావృత్తి ఫలితంగా చర్చలలోనికి వచ్చిన కొన్ని విషయాలను గ్రంథరూపంగా ప్రచురించినట్లయితే సుదూరస్థులైన ఇతరులు కూడా లాభం పొందగలరనడంలో సందేహంలేదు.

వేదాంత శాస్త్రానికి సంబంధించిన అనేక పారిభాషిక పదాలు అడుగడుగునా మనకు ఆయా గ్రంథాలలో కనబడుతూ ఉంటాయి. వాటి స్వరూప సంగ్రాదుల విషయంలో పాఠకులకు సందేహాలు కలుగుతూంటాయి. 'పంచతన్మాత్రలు', 'అష్టాంగాలు', 'షడూర్ములు', 'పంచకోశాలు' ఇత్యాది పదాలు రాగానే అవియేవో వెంటనే

స్మృతిపథంలో వచ్చేవారికి బాధలేక పోయినా ఇతరులకు ఎందరికో పుస్తక సాహాయ్యం అవసరం అవుతుంది. ఆ అవసరాన్ని తీర్చడానికై శ్రీ సోమసుందరంగారు సంకలనం చేసిన ఈ పారిభాషిక పదకోశం సర్వదా ప్రామాణికంగా ఉన్నది. వారు చేసిన పరిశ్రమను స్పష్టంగా చూపుచున్నది. "సప్తజ్ఞాన భూమికలు" మొదలైన వాటి విషయం సేకరించి వ్రాయడం ఎంతో పరిశ్రమ చేస్తేనే కాని సాధ్యంకాదు. ఇతర పారిభాషిక పదాలను కూడా చేర్చడం చేత-అందుచేతనే 'వేదాంతాదిపారిభాషిక పదకోశము' అని పేరు పెట్టినారు-దీని ఉపాదేయత్వము ఇనుమడించినది సునిశిత విమర్శనాధురీణులు, ఉత్తమ పాండితీ విరాజితులూ అయిన డా. మూలంపల్లి చంద్రశేఖరశర్మగారి పరిష్కారము దీనికి వన్నె తెచ్చినది. అయితే ఎవరిది ఎంత భాగమో పఠితలకు తెలియశక్యము కాదుగాన ఉభయులు ఈ సత్కార్య నిర్వహణలో సమపలభాగురే అని చెప్పవచ్చును.

జిజ్ఞాసులోకము ఈ గ్రంథము ద్వారా చాలా లాభమును పొందగలదని విశ్వసించుచున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు.

—: o :—

బ్రహ్మశ్రీ ప్రమోద చైతన్యస్వామి — క్యాంపు : శ్రీమళయాళస్వామి వారిమఠం
వేదాంత విజ్ఞాన ప్రచార — హైదరాబాదు.
సమితి సంస్థాపకులు, — 18-2-1992
గీతాజ్ఞానయజ్ఞ నిర్వాహకులు.

## శుభాశంసనము

వానప్రస్థాశ్రమములోనున్న సోమసుందరంగారు ఆశ్రమాన్ని సార్థకం చేస్తున్నారనాలి. ఆశ్రమాన్ని మార్చకుండానే ఆచరణమార్చుకొని, అంటే నియమ జీవితం, నియమితాహారం, నియమంగా స్వాధ్యాయం చేసుకుంటూ కాళిదాసులవారి రఘువంశంలో "వార్ధకేమునివృత్తీనాం" అన్నట్లు, భగవంతుడిచ్చిన ఈ వార్ధక్య జీవితాన్ని సహధర్మచారిణి సహకారంతో సద్వినియోగం చేసుకుంటున్న సాధక సత్పురుషులు.

వీరి స్వాధ్యాయం ఒక తపస్సనాలి. నిత్యకృత్యాల్లో స్వాధ్యాయమొక కృత్యమైపోయింది. ధన్యులు, సామాన్యులు చదివి తృప్తి పడతారు. కాని వీరు చదివినది

సొంతం అర్థం చేసుకునేంత వరకు స్వయంగా, సద్గ్రంథాలలో సరియయిన అర్థాల కొరకు సద్గ్రంథాలను సేకరించటం, వాటిని ఎంతో ఓర్పుతో చదివి మొత్తం మీద వారికి తృప్తికలిగే అర్థాలను ఆరాతీస్తారు. సందేహాలను సత్పురుషులద్వారా నివృత్తి చేసుకుంటారు. సాధకునికి పాఠకునికి ఇదొక సుగుణం. ఇది చాలా తక్కువ మంది లోనే మనం చూడగలం. తెలిసిన వాటితో ప్రవర్తించే ప్రయత్నంలో ఉంటారు. అంతేకాదు, తన కందినదాన్ని తోటి సాధకులకు, తనుపడిన బాధపడకుండా ఉండా లనే సదుద్దేశంతో సత్సంగ సభ్యులకు చదివి వినిపిస్తారు. వ్రాసిన వ్యక్తిని, చదివిన పుస్తకాన్ని పదిమందికి పరిచయం చేస్తారు. సంగ్రహించిన గ్రంథస్థ విషయాలను పదిమందికి పంచే పరోపకారబుద్ధి పోనిచ్చుకోరు. ఈ బుద్ధే మనముందున్న ఈ గ్రంథానికి రూపాన్నిచ్చింది. సాధకులకు ఇదొక తేనె తెట్టు, కాదు తేనెతో నింపిన గ్లాసు (లోటా), అర్థుడై చదివితే దీని వెనకాల కృషి తెలుస్తుంది. దీని రుచి తెలు స్తుంది. ఇలాగ ఋషి ఋణాన్ని తీర్చుకొంటున్న సోమసుందరం గారు ధన్యులు। ఈశ్వరానుగ్రహ పాత్రులు। అస్తు ।

ఓం తత్సత్

సదాజ్ఞాన సేవలో,
ప్రమోద చైతన్య.

—: o :—

Dr. Ravva Srihari,
M. A. (Sanskrit), M.A.
(Telugu), Ph. D.,
Prof. & Head, Dept. of Telugu,
University of Hyderabad.

16-2-836/F/2, Madhavanagar,
Hyderabad.
Date 16-2-'92

## అభినందన

శ్రీ సోమసుందరంగారు ప్రభుత్వ వ్యవసాయశాఖలో ఉన్నతోద్యోగులుగాను, వ్యవసాయ విశ్వ విద్యాలయంలో ఆచార్యులుగాను పనిచేసి విశ్రాంతులైన తరువాత ఆధ్యాత్మిక భావనను పెంపొందించుకొని ఆధ్యాత్మిక గ్రంథ పఠనంతోనూ, ఆధ్యా త్మిక చింతనలోనూ కాలక్షేపం చేస్తున్నవారు. తామేకాక తమ మార్గంలో ఎంద రినో నడిపిస్తున్న ఆదర్శప్రాయులు. వారు మాధవనగరు (సైదాబాదు)లో 'గీతాజ్ఞాన సేవా సమాజము' అనే పేర ఒక సంస్థను స్థాపించి ఆధ్యాత్మిక గ్రంథ పఠనం మొద

లైన కార్యక్రమాలను నిర్వహిస్తూ ఆధ్యాత్మిక విజ్ఞానాభివృద్ధికి దోహదం చేస్తున్నారు. ఈ సమాజములో ఆధ్యాత్మిక గ్రంథపఠనం చేస్తున్నప్పుడు వేదాంత, తత్సంబంధిత శాస్త్రపారిభాషిక పదాలకు వివరణ నిచ్చే ఒక నిఘంటువును ప్రకటించాలన్న సంకల్పం శ్రీ సోమసుందరంగారికి కలిగింది. అంతకు పూర్వమే కొంత కాలంగా ఈ పారిభాషిక పదాలను సేకరిస్తూ ఉండడంవల్ల వీరి సంకల్పం త్వరలోనే కార్యరూపం ధరించింది. దాని ఫలితమే ఈ "వేదాంతాది పారిభాషిక పదకోశం".

శ్రీ సోమసుందరంగారు వేదాంత, తత్సంబంధిత శాస్త్రాలకు సంబంధించిన పారిభాషిక పదాలతో సంఖ్యాపూర్వక పదాలను గూర్చి వివరణతో ఈ గ్రంథాన్ని ప్రకటించినారు. తెలుగులో ఈ విధమైన సంఖ్యాకోశాలు కొన్ని వెలువడినాయి. సంఖ్యార్థనామ ప్రకాశిక, సంకేత పదకోశం, సంఖ్యా వాచక పదకోశం మొదలైనవి. అయితే ఇవి ప్రత్యేకించి ఒక శాస్త్రానికి సంబంధించినవి కావు. ప్రత్యేక శాస్త్రాలకు సంబంధించిన నిఘంటువులు కూడా కొన్ని తెలుగులో కూర్చబడ్డాయి. ఇవి వైద్య శాస్త్రానికి, సంగీత శాస్త్రానికి సంబంధించినవి. ఆ కోవలో వెలువడిందే ఈ 'వేదాంతాది పారిభాషిక పదకోశం'. వేదాంత శాస్త్రానికి వెలువపడిన సంఖ్యా నిఘంటువుల్లో ఇది మొదటిదని నా భావన.

శ్రీ సోమసుందరంగారు కూర్చిన ఈ నిఘంటువులోని పారిభాషిక పదాలు కొన్ని ఏర్పేడు వ్యాసాశ్రమం వారు ప్రకటించే 'యథార్థ భారతి' పత్రికలో 'వేదాంత పరిభాష' అనే శీర్షికతో వరుసగా ప్రకటింపబడ్డాయి. ఇది శ్రీ సోమసుందరంగారి ఈ నిఘంటువుకు ఎంతో ప్రామాణికతను సంతరింప జేస్తుంది.

ఆధ్యాత్మిక గ్రంథాలను చదివేప్పుడు జిజ్ఞాసువులకి నిఘంటువు ఎంతగానో తోడ్పడుతుందనడంలో సందేహం లేదు.

శ్రీ సోమసుందరంగారి ఈ కృషిని మనసారా అభినందిస్తూ వారి లేఖిని నుండి మరికొన్ని గ్రంథాలు వస్తాయని ఆశిస్తున్నాను.

ఆర్. శ్రీహరి
16-2-'92

—o—

విద్యా భాషా ప్రవీణ
డా. మూలంపల్లి చంద్రశేఖరశర్మ,
M. A. (Sanskrit & Telugu), B.Ed., Ph.D.

165/SRT సైదాబాదు కాలనీ,
హైదరాబాదు-500 659.

## ప్రస్తుతి

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగత: పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ ॥

వేదములయంతము ఉపనిషత్తులు. వానివల్ల విద్యోదితమై వెలుగొందిన విజ్ఞానము వేదాన్తము. దీనిని మథించి వెలికితీసిన సారమే బ్రహ్మసూత్రములు. ఈ తత్త్వ సారామృతమునే మహాభారతాన్తర్గతముగా విశ్వజన సంతత సంభావ్య సమ్మాన్యముగా గానము చేసినదే భగవద్గీత. ఈ మూడింటినే ప్రస్థాన త్రయమందురు. దీనియందు విశ్వాత్మ తత్త్వ విచారము శాస్త్రీయముగా విశ్వతాత్త్విక సుమనోగమ్యమగునట్లు చేయబడినది.

సామాన్యముగా ఏ శాస్త్రీయ విచారమునకైనను అనుగుణమైన సాంకేతికత, దాని బోధించు పదజాలములు మొదలగు వానిని ఏర్పరుచుకొనవలసి యుండును. ధాన్యపు పంట యొక్క శాస్త్రీయ విజ్ఞానమున - దుక్కి చేయుట, ఎరువువేయుట, నీరుపెట్టుట, నాట్లు, కలుపు తీయుట, కోత మొదలగు పదములన్నియు వరిపంటకుండు విధాన క్రమమును తెలియజేయు సాంకేతిక పదములు. ఇవి పంటయొక్క ఆయా దశలను సంకేతముగా జేసికొని (గుర్తుగా జేసుకొని) వాడిన పదములు. వీటన్నింటిని కలిపి యేర్పడిన సాంకేతిక పదము 'వ్యవసాయము'. దీనినే పరిభాష యందురు. సంక్షేపార్థ సంకేత విశేషమే పరిభాష ఈ పరిభాషా పదజ్ఞానము లేక శాస్త్రీయ విజ్ఞాన దర్శనములు సమగ్రముగ బోధపడవు. కావుననే—

దీపోయథాప్రభాద్వారా సర్వవస్తు ప్రకాశకః ॥
పరిభాషాతథాబుద్ధ్యా సర్వశాస్త్రప్రకాశికా ॥

దీపము తన కాంతిచే సమస్త వస్తువులను ప్రకాశింపజేయునట్లు పరిభాష (సాంకేతిక పద విజ్ఞానము) సుబుద్ధమై సర్వశాస్త్ర విజ్ఞానముల ప్రకాశింపజేయును అని శాస్త్రకారులన్నారు. కాగా వేరు వేరు శాస్త్రములలో వేరు వేరు పరిభాషలున్నవి.

వేదాన్తమునకు సైతమిట్టి పారిభాషిక పదములు గలవు. అవి తత్త్వవేత్తలు ఆత్మ తత్త్వజ్ఞానానుభవమున, దాని క్రమముల సంకేతముగా తాము గుర్తించిన పదములు. తత్త్వజ్ఞానమును పొందగోరువారికి వీని వలన మార్గము సులభముగా

బోధపడును. కావున వ్యవసాయ విశ్వవిద్యాలయాచార్యులగు శ్రీ తురగా సోమసుందరంగారు ఈ వేదాన్తాది పారిభాషిక పదకోశమును విశ్వాత్మ తత్త్వ జిజ్ఞాసువులకుపయోగపడునట్లు సమకూర్చుట మిక్కిలి ప్రశంసనీయము.

సంస్కృతమున భిక్షుగౌరీ శంకరులు—సర్వ లక్షణసంగ్రహమను పేర సర్వతన్త్రసిద్ధాన్త పదార్థ లక్షణములను 152 పుటలతో ఒకచిన్న ప్యాకెట్ సైజు గ్రంథమును సమకూర్చి విజ్ఞలోకమున కందించిరి. అది నాలుగణాల మూల్యము గల గ్రంథము. మనభరీదేవి, పుట్టేగ్రామము, పోస్టుభవానీఖేడ్, హిస్సార్ (ఇండియా) వారిచే ప్రకాశితము. దీని లక్ష్యమును కొంతవరకైనను తెలుగులో ఈ వేదాన్తాది పారిభాషిక పదకోశము చక్కగా నెరవేర్చినదన వచ్చును.

పదకోశమనగనే ఇది నిఘంటువని యర్థమగును. ఇది నిజముగ ఒక చిన్న నిఘంటువే. నిఘంటువులు రెండు విధములు 1. సామాన్య నిఘంటువులు (ఇందన్ని పదముల యర్థము తీయబడును) 2. శాస్త్రీయాది విశిష్ట నిఘంటువులు (వైద్య పద కోశము మొ॥.) ఈ నిఘంటువులన్నియు సామాన్యముగా అకారాది వర్ణక్రమముననే కూర్చబడును. అమరసింహుడు మాత్రము తన నిఘంటువును మాత్రము పర్యాయ పదకోశ పద్ధతిలో పద్యాత్మకముగ అమరకోశముగ రూపొందించెను. అది యిప్పటికిని సర్వ సంస్కృత విద్యాలయ విద్యార్థి కంఠస్థమై యదార్థముగ అమరకోశమైనది అది పుస్తకాపేక్షలేకయే పద పదార్థ విజ్ఞాన జ్యోతిని ఆత్మ జ్యోతిగా ప్రకాశింపజేయుచున్నది. ఇందలి పర్యాయ పదములు తమ వ్యుత్పత్తులచే వాచ్యార్థములకు సమగ్ర నిర్వచనము తీయగలవు. ఇది సాహిత్య పరముగ సముచిత విశిష్టరసార్థజ్ఞాన ప్రబోధమునకుపయోగించును. శాస్త్రీయముగను ఆధ్యాత్మికముగను ఇది విశ్వాత్మతత్త్వార్థ ప్రబోధమును గూడ కలిగించును. దినకర శబ్దము భాస్కరాది సూర్య పర్యాయ పదములతో సూర్యతత్త్వమును సమగ్రముగ దెలియజేయుట సమస్త విజ్ఞ విహితము. ఈ ప్రభావమే అనాదినుండివచ్చు వైదిక నిఘంటు (నిరుక్త నిఘంటు) పదములను సైతము ఛందోబద్ధము జేయించినది.

కాని ఈ వేదాన్తాది పారిభాషిక పదకోశము అకారాది వర్ణక్రమ గర్భితమైన సంఖ్యాక్రమమున గూర్చబడుట విశేషము. శాస్త్రీయ తత్త్వ విచారములలో మూల తత్త్వములు సామాన్యముగా సంఖ్యాబద్ధములై ప్రతిపాదింపబడుట దీని కారణమనిపించును. తార్కికులకు పదార్థములు ఏడు. సాంఖ్యులకు తత్త్వములు ఇరువది నాలుగు మొ. కావున గ్రంథకర్త సంఖ్యా క్రమ ప్రాధాన్యముగ తమ వేదాన్తాది పారిభాషిక పదములను గూర్చుట జరిగినది. అందలి 'ఆది' పదము యధాను గుణముగ

త్రివిధ ఉపాదాన కారణములు : 1. ఆరంభ ఉ.కా. – ప్రపంచమునకు పరమాణువు ఉ. కా. (తార్కికాదుల వాదము) ఉదా : వస్త్రమునకు నూలు. 2. పరిణామ ఉ.కా. – జగత్తునకు ప్రకృతి ఉ.కా. (సాంఖ్యవాదుల వాదము) ఉదా : పెరుగునకు పాలు 3. వివర్త ఉ.కా. – ప్రపంచమునకు ఈశ్వరుడు ఉ కా. (అద్వైత తత్త్వవేత్తల వాదము) ఉదా ; కల్పిత సర్పమునకు రజ్జువు.

,, ఉపాసనలు : 1. బ్రహ్మ ఉ – నిర్గుణ బ్రహ్మానుసంధానము. 2 మంత్ర ఉ – మంత్రములతో ఉపాసించుట. 3. ప్రతిమ ఉ.– ప్రతిమను ఉపాసించుట.

,, ఋణములు (ఋణత్రయము) : 1. ఋషి ఋ. – ఋషులు మన శ్రేయస్సు కొరకు వేద శాస్త్రములను చెప్పినందువలన కలిగెడి ఋణము అధ్యయనాపనమున తీరును. 2. పితృ ఋ. – తల్లి దండ్రులు మనలను పెంచి పెద్ద చేసినందువలన కలిగెడి ఋణము సంతానమున తీరును. 3. దేవ ఋ. – దేవతలు మనలను ఈతి బాధల నుండి రక్షించినందువలన కలిగెడి ఋణము. యజ్ఞములు చేయుట వలన తీరును.

,, ఋషులు : 1. రాజర్షి – కర్మయోగి. సేవా కార్యములు చేయువాడు. రాజులలో ఋషి. ఉదా : జనకుడు. 2 దేవర్షి – భక్తి యోగి. ఈశ్వరుని సగుణరూపమున ఉపాసించువాడు. దేవతలలో ఋషి ఉదా. నారదుడు. 3 బ్రహ్మర్షి – జ్ఞానయోగి, జ్ఞాన మార్గమును చూచినవాడు. బ్రాహ్మణులలో ఋషి ఉదా. కశ్యపుడు.

త్రి కరణములు : 1. కాయము. 2. వాక్కు. 3. మనస్సు.

త్రివిధ కర్మ ఫలములు : 1. ఇష్ట ఫ – స్వర్గాదులు 2. అనిష్ట ఫ. – నరక తిర్యక్ జన్మాదులు. 3 మిశ్రమ ఫ. – సుఖదుఃఖ మిశ్రమ మగు మానవ జన్మ.

,, కర్మములు : (i) 1. పుణ్య క. – వేదోక్త విధిచేత చేయబడునది, 2. పాప క. – వేదోక్త విధిని తప్పి చేయబడునది. 3. మిశ్రమ క. – విద్యా విదులచే చేయబడునది.

# ప్రవేశిక

హైదరాబాదులోని మాధవనగరునందు గీతాజ్ఞానసేవాసమాజము బ్రహ్మశ్రీ ప్రమోద చైతన్యులవారి ఆశీర్వాదములతో ప్రారంభింపబడినది. నేను దానిలో ప్రతి వారము సత్సంగము నిర్వహించినప్పుడు అనేక వేదాంత గ్రంథములు, ఆధ్యాత్మిక పత్రికలు పఠించి వివరించుటయేగాక, వానిలోనిసారము తత్త్వబోధ, హిందూధర్మ పరిచయము-కర్మ, భక్తి, జ్ఞానము మొదలైన లఘు ప్రచురణలద్వారా ప్రచారముచేయుట జరిగినది. ఈ ప్రవచన సందర్భములో ముఖ్య వేదాంతపారిభాషిక పదముల అర్థములు సమాజసభ్యులకు తెలియజెప్పుట సంభవించినది. ఈ వేదాంత పారిభాషిక పదములన్నింటిని వీలైనంతవరకు సేకరించి అర్థవివరణతో పుస్తకరూపమున ప్రచురించిన సామాన్య జిజ్ఞాసులకు ఉపకరించగలదను అభిప్రాయం కలిగినది. అన్ని పదములు, వాటి అర్థములు సేకరించుట వృద్ధాప్యములో నాకు సాధ్యముకాని పనియని తలచి, వేదాంత పారిభాషిక పదములలో కేవలము ఏకాది సంఖ్యలలో నిముడగల పదములను మాత్రమే సంగ్రహించుట కొంతవరకు సులభమగునని ఆ పనికి పూనుకొంటిని దీనికి తగిన స్ఫూర్తి 'అమృతవాహిని' పుస్తకములో 'వేదోపనిషదాది సూక్తులు' చూచిన తరువాత కలిగినది. డా. రవ్వా శ్రీహరిగారి 'సంకేత పదకోశము', ఇతర గ్రంథములు యీ ప్రయత్నమునకు తోడ్పడినవి.

సంఖ్యావాచక పద్ధతిలో అర్థముతో సహా వివరించు వేదాంత పారిభాషిక పదములు ఎచ్చటను పుస్తక రూపములో లభ్యము కానందున, వాటిని లభ్యమైన గ్రంథములు, పత్రికల నుండి కొన్ని సంవత్సరములుగా సేకరించుట జరిగినది. అవి 'వేదాంత పరిభాష' (సంఖ్యాను క్రమణిక) అను శీర్షిక క్రింద శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు, వారిచే ప్రచురితమైన 'యథార్థ భారతి' ఆధ్యాత్మిక మాసపత్రికలో డిసెంబరు 1983 నుండి డిసెంబరు 1987 వరకు ప్రచురింపబడినవి. ఆ పదములు డా. మూలంపల్లి చంద్రశేఖర శర్మగారి సహకారముతో కొన్ని మార్పులు, కూర్పులు చేయబడి ముందుగా ద్వి, త్రి, చతుర్ మొదలైన సంఖ్యల క్రమమున నీయబడినవి. తరువాత ప్రతి సంఖ్య క్రింద అకారాది క్రమములో వివరింపబడినవి ఆదిలో వేదాంత పారిభాషిక పదముల వివరణ మాత్రమే సంకల్పింపబడినది గాని, దానితో సన్నిహిత సంబంధముగల పురాణ, ఇతిహాస, వ్యాకరణ, ధర్మ, యోగాది శాస్త్రములలోని పద సేకరణ కూడ జరిగినది.

నేను ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగానుంటూ వ్యవసాయమునకు సంబంధించిన వ్యాసములు, గ్రంధములు ఆంగ్లములోను, ఆంధ్రములోను వ్రాసిన అనుభవము ఉన్నప్పటికిని, వేదాంత విషయములకు సంబంధించిన

యీ విధమైన పదకోశ గ్రంథమును కూర్చుట నాకు ప్రథమ ప్రయత్నము. సహృదయులైన పాఠకులు దీనిలోని లోపములను మన్నించి, గుణములు మాత్రమే గ్రహింపగలరని మనవి. ఈ నిఘంటువున చేర్చవలసిన సంకేత పదములింకను గలవుగాని సమయాభావమున, గ్రంథ విస్తర భీతిచే వాటిని చేర్చుట జరుగలేదు. భగవదనుగ్రహమున్నచో ద్వితీయ సంస్కరణమున ఇంకను కొన్ని ముఖ్య పదములను చేర్చవలనని యాశించుచున్నాను. పదకోశము నందలి సాంకేతిక పదసూచనలు వేరే వివరింపబడినవి.

దీనిని సహృదయులైన జిజ్ఞాసువులు ఆదరించినచో నా యీ ప్రయత్నము సఫలముకాగలదని ఆశించుచున్నాను

పదవీ విరమణ తరువాత నేను మాధవనగరులో నివాసమేర్పరుచుకొన్నప్పుడు వారి గీతాజ్ఞాన యజ్ఞ ప్రవచనముల ద్వారా ప్రభావితునిజేసి, ఆధ్యాత్మిక చింతను పురిగొల్పి, గీతాజ్ఞాన సేవా సమాజ స్థాపనకు తమ ఆశీర్వాదములిచ్చి, ఈ గ్రంథ రచనకు ముఖ్య కారకులేగాక, దీనిని చూచి ఆశీస్సులందించిన జ్ఞానులు బ్రహ్మశ్రీ ప్రమోద చైతన్యులవారికి నమస్సుమాంజలులు.

కోరినంతనే ఈ గ్రంథమును చూచి, ఆశీర్వదించి వారి అమూల్యాభిప్రాయమును దయతో నిచ్చిన పూజ్యులు బ్రహ్మ విద్యాలంకార శ్రీ సూరి రామకోటిశాస్త్రి గారికి నా హృదయపూర్వక దన్యవాదములు. నా మనవిని మన్నించి గ్రంథమును పరిశీలించి తమ విలువైన అభిప్రాయము నందించిన వేదాంత శిరోమణి ఆచార్య డా. పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

ఆదినుండి ఈ కోశరచనలో అడుగడున తగిన సూచనలిచ్చి, ప్రోత్సహించి దీనిని గూర్చి తమ యభిప్రాయమును తెలిపిన సౌహార్దమూర్తులు, స్నేహశీలి ఆచార్య డా. రవ్వా శ్రీహరిగారికి నా కృతజ్ఞతలు. సేకరింపబడిన పారిభాషిక పదములు, వాటి వివరణలు అమూలాగ్రముగా పరిశీలించి, చర్చించి పదకోశమునకు అనుగుణముగా పరిష్కరించి ప్రస్తుతినందజేసిన సహృదయులు డా. మూలంపల్లి చంద్రశేఖర శర్మ గారికి నేనెంతో ఋణపడియున్నాను. వారికి నమోవాకములు.

గ్రంథ ముద్రణ సందర్భమున ప్రూఫ్సు కాగితములు ఎప్పటికప్పుడు నాకందజేసి తాను శ్రమించి నాకు శ్రమను తగ్గించిన శ్రీ కె. వి. నరసింహంగారికి, ఈ గ్రంథమును నిర్దుష్టముగా ముద్రించి ఇచ్చిన శ్రీలక్ష్మి ప్రింటర్సు అధిపతి శ్రీ జి. యస్. యన్. మూర్తిగారికి నా కృతజ్ఞతలు.

హైదరాబాదు,
తేది 21-2-1992

ఇట్లు
బుధజన విధేయుడు,
టి. సోమసుందరం

## సంకేత వివరణలు

1. సంఖ్యావాచక పదములలో ఒకే సంఖ్యక్రింద ఒక్కొక్కప్పుడు వాడు కనుబట్టి రెండు విధములుగా పద ప్రయోగము చేయబడినది. ఉదా.: 13వ పుటలో 'త్రివిధ' 'త్రి' మొదలైనవి. సాంకేతిక పదములు 'అ'కార క్రమములో తెలుపబడినది.

2. ఒక పారిభాషిక పదము బోధించు వివిధ పదములను వివరించునప్పుడు ఆ పదమునను తిరిగి చెప్పుటకు బదులు దాని తొలి అక్షరమును మాత్రమే సూచింపబడినది. ఉదా : 1వ పుటలో ద్వివిధ అనుమానములు : 1. స్వార్థ అ. 2. పరార్థ అ. 'అ' అనగా అనుమానము అని అర్థము గ్రహింపవలెను.

3. కొన్ని పదముల సందర్భములుగాని, వాని అర్థములుగాని తెలుపుటకు కుండలీకరణములలో సూచింపబడినవి. ఉదా: 1వ పుటలో ద్వివిధ అర్థములు : 1. శక్యార్థము (వాచ్యార్థము), 29వ పుటలో చతుర్విధ ద్వారపాలకులు (మోక్షమునకు) మొదలైనవి.

4. ఒక సంఖ్యావాచక పదమునకు రెండుగాని, అంతకంటే ఎక్కువగాని వివరణలు ఉన్నప్పుడు (i). (ii), (iii) సంఖ్యలు వాడబడినవి. ఉదా : ద్వివిధ మార్గములు : (i) 1. ప్రేయో మా. 2. శ్రేయో మా. (ii) 1. ప్రవృత్తి మా. 2. నివృత్తి మా. (iii) 1. ధూమాది మా. 2. అర్చిరాది మా.

# 1. ఏకము

ఏకము (ఏకవస్తువు) : అద్వితీయ పరబ్రహ్మము-పరమాత్మ-పరమేశ్వరుడు
ఏకాక్షరము —ఓంకారము

# 2. ద్వి

ద్వివిధ అధ్యాసలు : 1. అర్థాధ్యాస – ఒక వస్తువునందు మరియొక వస్తువను భ్రాంతి. 2. జ్ఞానాధ్యాస – అధ్యస్త వస్తువుయొక్క జ్ఞానము.

,, అన్నములు : 1. హుతము - దేవతలకై అగ్నియందు ఇచ్చు అన్నము లేక ద్రవ్యము. 2. ప్రహృతము - హోమానంతరము చేయబడు బలిహరణము.

,, అనుమానములు : 1. స్వార్థ అ. - సహేతుకముగా తాను సత్యము నూహించి నిర్ణయించుట. 2. పరార్థ అ. – తాను పై విధముగా నిర్ణయించిన దానిని వాక్యములలో చెప్పి ఇతరులు కూడ సత్యమునూహించి నిర్ణయించునట్లు చేయుట

,, అర్థములు : 1. శక్యార్థము (వాచ్యార్థము) – శబ్దమునందలి శక్తివలన జ్ఞానముద్వారా తెలియబడెడి అర్థము. 2. లక్ష్యార్థము – లక్షణావృత్తిచే తెలియబడు అర్థము.

,, అవిద్యలు : 1. మూల అ. – ఈశ్వరునితో సంబంధించిన అవిద్య (బ్రహ్మపరకమైన అజ్ఞానము). 2. తూల అ. – జీవుని యందుండే అవిద్య.

,, ఆత్మజ్ఞానప్రాప్తి సాధనములు –1 బహిరంగ సాధన–కర్మ- 2. అంతరంగ సాధన – ధ్యానము

ద్వివిధ ఆత్మరూపములు : 1. విషయ సంగతమైన రూపము
2. విషయానుభవము లేక మధ్యస్థముగా వెలుగుచుండు రూపము.

,, ఆత్మలు : 1. జీవాత్మ — అంతఃకరణము, ప్రతిబింబము, అధిష్ఠానము, దేహత్రయము, అజ్ఞానము, అధ్యాసము అనే ఆరింటితో కూడినది. 2. పరమాత్మ — సర్వ ఆధిష్ఠాన పరబ్రహ్మము.

,, ఆత్మిక దుఃఖములు : 1. ఆధులు - మోహజన్యములగు మానసిక దుఃఖములు. 2. వ్యాధులు - వాత, పిత్త, శ్లేష్మ ప్రకోపములచే కలిగెడిది జ్వరశూలాదులు.

,, ఆవరణములు : 1. అసత్తాపాదక ఆ. - బ్రహ్మమే వేరను అజ్ఞానావస్థ. 2. అభానాపాదక ఆ. — బ్రహ్మము తెలియబడుటలేదు అను అజ్ఞానావస్థ

,, ఉపాసనలు : 1. సగుణ ఉ. - నామరూపోపేత బ్రహ్మ ఉపాసన
2. నిర్గుణ ఉ. - సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితం ఉపాసన.

,, గుణాదాన భ్రాంతులు : 1. లౌకిక గు. - శరీరమునకు ఔషధాదుల వలన పుష్టి, తేజము కలిగింపగల మనుభ్రాంతి. 2. శాస్త్రీయ గు. - శాస్త్రమునందు చెప్పబడిన పావనత్వాది గుణములు ఈ దేహమునకు సంపాదింపవలెనను భ్రాంతి.

,, గృహస్థులు : 1. అకృతోపాస్తులు - బహిర్ముఖచిత్తులై, సాధన చతుష్టయ సంపత్తి లేక వేదాంత శ్రవణము చేయనివారు. 2. కృతోపాస్తులు— సాధన చతుష్టయ సంపత్తి కలిగి వేదాంత శ్రవణము చేయువారు.

,, చిత్తరూపములు : 1. ఆత్మాకారము - పరమాత్మ రూపము.
2. అనాత్మాకారము - శబ్దాది విషయ రూపము.

,, చిత్తనాశ సాధనములు : 1. యోగము - చిత్తవృత్తులను నిరోధించునది. 2. జ్ఞానము - చిద్రూపుడగు ప్రత్యగాత్మనుండి జడములగు దేహేంద్రియాదులను 'నేతి' 'నేతి' యని నిషేధించుచు, నిషేధావధియగు ప్రత్యగాత్మను ఎరుగుట.

ద్వివిధ చైతన్యములు : 1. వ్యాపక చై. - అవిద్యకు విరోధికాని చైతన్యము. 2. వృత్తి చై. - అవిద్యకు విరోధియైన చైతన్యము.

,, జీవిత ఆశయములు : 1. దుఃఖనివృత్తి. 2. సుఖప్రాప్తి.

,, జీవులు — 1. ఆత్మార్థజీవి - తనకొరకే బ్రతుకువాడు. 2. తదర్థ జీవి - అందరి కొరకై తను బ్రతుకువాడు.

,, జ్ఞానములు : (i) 1. పరోక్ష జ్ఞా - తనకు భగవంతుడు అన్యముగా తోచి ఉపాసించుట. 2. అపరోక్ష జ్ఞా - తానే పరమాత్మగా నుండుట. (ii) 1. స్వాభావిక జ్ఞా. - 'నేను మనుష్యుడను', 'ఇది నా శరీరము' అనుకొను జ్ఞానము. 2. ఔపదేశిక జ్ఞా. - ఘటాదులవలె దృశ్యమగుట వలన శరీరము ఆత్మ కాదు అను జ్ఞానము.

,, జ్ఞాన దోషములు : (i) 1. అసంభావన - సంశయము. 2. విపరీత భావన - దేహమునేనని, జగత్తు నిజమని పరమేశ్వరుడు ఎక్కడో పరోక్షముగా నున్నాడను వ్యతిరేక బుద్ధి. (ii) 1. అకృతాభ్యాగమము - చేయని వారికి ఫలము నిచ్చుట. 2. కృత ప్రణాశము - చేసిన వారికి ఫలము నివ్వక పోవుట.

,, దర్శనములు : 1. ఆస్తిక ద. - వేదప్రమాణములను అంగీకరించి పార లౌకికార్థమును ప్రతిపాదించెడివి. ఉదా: న్యాయ, సాంఖ్య, మీ మాంస ద. 2. నాస్తిక ద. - వేదప్రమాణములను అంగీకరింపక కేవలము యుక్తుల చేతనే పదార్థమును ప్రతిపాదించెడివి. ఉదా: చార్వాక ద

,, దైవకార్యములు : 1. సృష్టి, స్థితి, లయములు. 2. దేవతల శక్తికి మించిన దైత్యాదుల వలని బాధానివారణ.

,, దోషదృష్టి వైరాగ్యములు : 1. భోగ త్యాగేచ్ఛ - అనుభవించుచున్న భోగములను విడిచి పెట్టుట. 2. భోగానిచ్ఛ - నూతన భోగములను కోరకుండుట.

ద్వివిధ దృష్టాంతములు 1. అన్వయ దృ. - చెప్పిన లక్షణమున్న లక్ష్యము
2. వ్యతిరేక దృ. - లక్షణము బట్టని లక్ష్యేతరము.

,, ధర్మములు : 1. శాస్త్ర ధ. - శాస్త్రములలో వ్రాసి పెట్టబడినవి
2. కుల ధ. - కుల పెద్దల ద్వారా ఆచారపద్ధతిలో వ్యవహరింప బడినవి.

,, ధ్యానములు : (i) 1. ప్రతీక ధ్యా. - సాలగ్రామమును విష్ణువుగా భావించుట. 2. ధ్యేయానుసారధ్యా. - విష్ణువును చతుర్భుజ మూర్తిగా భావించుట. (ii) 1. అభేద ధ్యా. - తీవ్ర వైరాగ్యముతో నిర్గుణ బ్రహ్మమును తానుగా ధ్యానించుట. 2. భేద ధ్యా. - పరమాత్మను తనకంటె వేరుగా సగుణరూపుడుగా ధ్యానించుట. (iii) 1. సవిచార ధ్యా. - శబ్దార్థముల యుల్లేఖ పూర్వముగా భావన ప్రవర్తించుట. 2 నిర్విచార ధ్యా. పైన చెప్పబడినది లేనిది.

,, ధ్వనులు : 1. ఆహతము - ప్రయత్నముతో కలుగు ధ్వని.
2. అనాహతము- ప్రయత్నము లేక తనకు తానుగా కలుగు ధ్వని.

,, పదార్థములు : 1. సామాన్యములు - ప్రపంచమునందు వ్యాపకము లైనవి 2. విశేషములు - ప్రపంచమునందు వ్యాపకము కానివి.

,, పరమహంస సన్న్యాసములు : 1. వివిదిష స. - జ్ఞానప్రాప్తి కొరకు గ్రహించునది. 2. విద్వత్ స. - వివిదిష సన్యాసము తరువాత చిత్తశాంతికొరకు, వాసనాక్షయ, మనోనాశముల కొరకు స్వీకరించునది.

,, పరమాత్మ రూపములు : 1. సోపాధికము - ఉపాధుల (సూర్యుడు మొ.) ద్వారా తెలియ బడునది. 2. నిరుపాధికము - ఏ ఉపాధి సంబంధములేక స్వాభావికముగా నుండునది.

,, పురుషులు : 1. క్షర పు. - ఉత్పత్తి నాశములు కలిగి కార్యోపాధి రూపములనుండు సర్వ భూత శరీరములు. 2. అక్షర పు. - ఆత్మ జ్ఞానముతో తప్ప అన్యవిధముగా నశింపని కూటస్థమని చెప్పబడు కారణోపాధియగు మాయ.

ద్వివిధ ప్రకృతులు : 1. పర ప్ర. - పరమాత్మ స్వరూప ప్రకృతి. చేతనము. జీవరూపము. 2. అపర ప్ర. - పరమాత్మ స్వభావ ప్రకృతి. జడము. పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములను ఎనిమిది కలిగియుండునది.

,, ప్రపంచ పదార్థములు : 1. నామము. 2. రూపము.

,, ప్రమాణములు : 1. స్వతః ప్ర. - తమ సిద్ధికై మరియొక ప్రమాణమును కోరనిది. 2. పరతః ప్ర. - తమ సిద్ధికై మరియొక ప్రమాణమును కోరునది.

,, ప్రాప్తులు : 1. అప్రాప్తరూప ప్రాప్తి - లేని వస్తువును సంపాదించుకొనుట. 2. ప్రాప్తరూప ప్రాప్తి. - తనవద్దనే యుండి మరచిపోయిన వస్తువును జ్ఞాపకము తెచ్చుకొని పొందుట.

,, బ్రహ్మ చైతన్యాంశములు : 1. సామాన్య అంశము- బ్రహ్మ చైతన్యము అధిక ప్రదేశమందును అధిక కాలమునందును అనువర్తించి యుండునది. 2. విశేషములు - బ్రహ్మ తన్యము శూన్యప్రదేశమునందును, శూన్యకాలమందు మాత్రమే తెలియబడునది.

,, బ్రహ్మజ్ఞాన బహిరంగ సాధనలు : 1. కర్మ. 2. ఉపాసన.

,, బ్రహ్మములు : 1. సగుణ బ్ర. - నామరూపాత్మక సమస్త ప్రపంచము. అపర బ్రహ్మము. 2. నిర్గుణ బ్ర. - సజాతీయ, విజాతీయ, స్వగత భేదములేనిది. పరబ్రహ్మము.

,, బ్రహ్మలక్షణములు : 1. స్వరూప ల. - తన లక్ష్యముయొక్క స్వరూపమైయుండి, అన్యపదార్థములను తన లక్ష్యమునుండి వేరుచేయునది. ఎల్లప్పుడు ఉండునది. 2. తటస్థ ల. - తన లక్ష్యమునందు కొంతకాలము మాత్రమేయుండి, తన లక్ష్యము ఇతర పదార్థములనుండి వేరుచేసి తెలుపునది. కొంతకాలము మాత్రము ఉండునది.

ద్వివిధ భూత అవస్థలు : 1. అవ్యక్తము - భూత జాలము పుట్టకముందు గోచరింపని అవస్థ. 2. వ్యక్తము - భూత జాలము పుట్టిన తరువాత కనిపించు అవస్థ.

,, మనస్సులు : 1. శుద్ధ మ. - కోర్కెలు లేని మనస్సు. 2. అశుద్ధ మ. - కామసంకల్పములతో కూడిన మనస్సు.

,, మనోనాశములు : 1. సరూప మ. - జీవన్ముక్తియందు కలుగునది. 2. అరూప మ. - విదేహ కైవల్యమునందు కలుగునది.

,, మనోవృత్తులు : 1. సంకల్పము - మనస్సునందు మొదట తోచినది. 2. వికల్పము - మొదట తోచిన దాని పిమ్మట దానికి వ్యతిరేకముగా తోచినది.

,, మార్గములు : (i) 1. ప్రేయో మా. - విషయ సుఖమునిచ్చునది. అనిత్య సుఖమార్గము. 2. శ్రేయో మా. - నిత్య సుఖము లేక మోక్షమునకు మార్గము. (ii) 1. ప్రవృత్తి మా. - ఫలములు కోరి కర్మములు చేయుట. రక్తుడై ప్రవర్తించునది. 2. నివృత్తి మా. - ఫలాపేక్ష లేకుండ భగవదర్పణముగా కర్మములు చేయుట. సంసారము నుండి విరక్తుడై నివర్తించునది. లేక కర్మములకు దూరముగానుండి జ్ఞానమార్జించుట. (iii) 1. ధూమాది మా. - పునరావృత్తి సహితమైనది. 2. అర్చిరాది మా. - పునరావృత్తి రహితమైనది.

,, ముక్తావస్థలు : 1. జీవన్ముక్తుడు - శరీరముతో నుండియు శరీరధర్మములు భాసమానములగుచుండగా సుఖదుఃఖములను స్వప్నవత్తుగా తెలియువాడు. బ్రహ్మవేత్త. 2. విదేహముక్తుడు - శరీర పాతానంతరము కలిగిన అద్వితీయ బ్రహ్మ.

,, ముక్తులు : 1. క్రమముక్తి - సగుణ బ్రహ్మోపాసకులు దేవలోక యానమున బ్రహ్మలోక ప్రాప్తి కలిగి ముక్తిని పొందుట. 2. విదేహముక్తి - నిర్గుణ బ్రహ్మోపాసకులు యీ లోకమందే

ప్రారబ్ధ శరీరముతో జీవించి, ప్రారబ్ధము నశించగానే ముక్తిని పొందుట.

ద్వివిధ మూల అజ్ఞానములు : 1. శుద్ధ సత్త్వగుణ ప్రధాన అ.- మాయ. 2. మలిన సత్త్వగుణ ప్రధాన అ. - అవిద్య.

,, యోగములు : 1. సగుణ యో. - భగవంతుని నామరూపాది సహితునిగా ధ్యానించుట. 2. నిర్గుణ యో. - భగవంతుని నామరూప రహితునిగా ధ్యానించుట.

,, రజోగుణములు : 1. ప్రవృత్తి రూపము. 2. దుఃఖరూపము.

,, లక్షణా ప్రయోజనములు : 1. వ్యావృత్తి - సరిగా లక్ష్యమును గుర్తించుట. 2. వ్యవహారము - సరిగా లక్ష్యమును గుర్తించునట్లు ఒకరికి చెప్పుట.

,, వస్తుగుణములు : ప్రమేయము - (ప్రత్యక్షాది) ప్రమాణములకు అందునది. 2. అప్రమేయము - ప్రమాణములకు అందనిది.

,, వస్తు వ్యవహారములు : 1. యోగము - లేని వస్తువును సంపాదించుట. 2. క్షేమము - సంపాదించిన వస్తువును రక్షించుకొనుట.

,, వస్తువులు : 1. చేతనము - చైతన్యమున్న వస్తువు. 2. జడము - చైతన్యము లేని వస్తువు.

,, వాక్యములు : 1. మహా వా. - జీవ బ్రహ్మల ఏకత్వమును బోధించునది (తత్త్వము). 2. అవాంతర వా. - జీవబ్రహ్మల ఏకత్వమునకు అనుగుణముగా జీవుని గూర్చియు, బ్రహ్మను గూర్చియు బోధించునది,

,, వాదములు : 1. భోగ వా. - మనస్సు కోరినట్లు వస్తువులను బయటనుండి గ్రహించుట. 2. త్యాగ వా. - విషయములను త్యజించుట.

,, వాసనలు : 1. శుద్ధ వా. - ముక్తికి తోడ్పడు వాసనలు. 2. మలిన వా. - సంసారమున బంధించు వాసనలు.

ద్వివిధ విచారణలు : 1. సాక్షియుతము - న్యాయస్థానముల జరుగు లౌకిక విచారణ. 2. సాక్షి రహితము - జీవులు శారీరకముగాను, ఆంతరంగికముగాను ఇతరులకు తెలియకుండ చేయు పుణ్య పాపములు పరమేశ్వరుడు మాత్రమే ఎరిగి, వివిధ జన్మలందు తగిన అనుభవములను నిర్ణయించుట.

" వైరాగ్యములు : 1. అపర వై. - ఇహలోక పరలోక సుఖములయందు అనాసక్తి 2. పర వై. - త్రిగుణములందును ఇచ్ఛారాహిత్యము.

" వ్యభిచారములు : 1. అన్వయ వ్య - కారణమున్నను కార్యము లేకుండుట. 2. వ్యతిరేక వ్య.—కారణము లేకున్నను కార్యముండుట.

" శరీరములు : 1. జీవ శరీరము - పూర్వము చేసిన కర్మల ఫలితముగా లభించినది. 2. అవతార శరీరము - సాధుజనుల సత్కర్మల, ప్రార్థనలవలన దుష్టజనుల అధర్మకృత్య నాస్తిక భావముల కారణముగా పరమేశ్వరుడు దాల్చిన శరీరము.

" శాస్త్రలక్షణములు : 1. శాసనము - చేయవలసిన పనులను శాసించుట. 2. శంసనము - గుప్తముగా నుండు వస్తువును వెల్లడి (అభివ్యక్తము) చేయుట.

" శౌచములు : 1. బాహ్యశౌచము - శారీరక శుభ్రత. 2. అభ్యంతర శౌచము - అంతః కరణ శుచిత్వము.

" శ్రేయస్సులు : 1. దృష్ట శ్రే. - దృష్టికి కనుపించునది. ఉదా: రాజ్యాది భోగములు. 2. అదృష్ట శ్రే. - దృష్టికి గోచరించనిది. ఉదా: స్వర్గాది సుఖములు.

" సంబంధములు : 1. అనుకూలము. 1. విరుద్ధము.

" సంశయములు : 1. ప్రమాణగత సం. - శాస్త్ర వాక్యములలో సంశయములు (ఉదా: వేదాంత వాక్యము అద్వితీయ బ్రహ్మ బోధకములా, కాదా?) 2. ప్రమేయగత సం. - ఆత్మయందు

అనగా తన స్వరూపమందు సంశయము. (ఉదా : జీవ బ్రహ్మ లకు భేదము సత్యమా, కాదా?)

ద్వివిధ సన్యాసులు : 1. ముఖ్య స. — ఆత్మ జ్ఞానము కలిగి సర్వకర్మ సన్యాసము చేసినవారు. 2. గౌణ స. — ఆత్మ జిజ్ఞాసతో సన్యాసము చేసిన వారు.

,, సమాధులు : 1. సవికల్ప స. — తెలిసికొనువాడు, తెలివి, తెలియదగినది అను త్రిపుటి నిలయ మందకయే కలుగు చిత్తైకాగ్రత. 2. నిర్వికల్ప స—. పైన చెప్పిన త్రిపుటి తోచక కేవలము జ్ఞేయమగు పదార్థమునందే నిలకడ గలిగి యుండుట.

,, సర్వజ్ఞత్వములు : 1. గౌణ స. — విరాట్ పురుషుడు కేవలము సమష్టి స్థూలదేహములను, హిరణ్య గర్భుడు కేవలము సమష్టి స్థూల సూక్ష్మ దేహములను మాత్రమే తెలిసికొనగలుగుట. 2. ముఖ్య స. — ఈశ్వరుడు స్థూల సూక్ష్మకారణ దేహములను మూడింటిని తెలిసికొనగలుగుట.

,, సాంకర్యములు : 1. సంకరము — నీరక్షీరన్యాయ యోగము 2. సంసృష్టి - తిలతండుల న్యాయయోగము.

,, సహచారములు : అన్వయ స. - కారణమున్న కార్యముండుట 2. వ్యతిరేకము - కార్యము లేకున్న కారణము లేకుండుట.

,, సృష్టులు : 1. యుగపత్ సృ. — ఆకాశాది పంచభూతములను బ్రహ్మ విష్ణు రుద్రాది దేవతలను సూర్యాది గ్రహములను ఏక కాలములో సృష్టించుట. 2. క్రమ సృ. — బ్రహ్మాదుల వలన క్రమముగా సృష్టించుట.

## 3. త్రి

త్రివిధ అంగములు : 1. ఆచారము 2. వ్యవహారము 3. ప్రాయశ్చిత్తము.

త్రివిధ అంతఃకరణ దోషములు : 1 మలము - జన్మాంతర పాపములు 2. విక్షేపము - చిత్త చాంచల్యము (రజోగుణ కార్యము) 3 ఆవరణము - స్వరూపాచ్ఛాదనము (తమోగుణ కార్యము).

,, అగ్నులు : 1. గార్హపత్యము 2 దక్షిణాగ్ని 3 ఆహవనీయము

,, అవతార ప్రయోజనములు : 1. సాధు సంరక్షణము 2 దుష్ట సంహారము, 3 ధర్మ సంస్థాపనము.

,, అవస్థలు : 1 జాగ్రత - మెలకువగా ఉండుట. 2 స్వప్నము - కలలు గనే అవస్థ 3. సుషుప్తి - గాఢ నిద్రలో ఉండుట.

,, ఆత్మలు : 1. గౌణాత్మ - చిదాభాసుడు 2. మిధ్యాత్మ - శరీరము 3. ముఖ్యాత్మ - పంచకోశాతీతమైన ప్రత్యగాత్మ.

,, ఆత్మ విచార విధానములు : 1. ప్రాకృతిక వి. - ప్రకృతిలోని ప్రతి వస్తువును శాస్త్రీయ విశ్లేషణమున పరిశోధించి సృష్టి రహస్యమును కనుగొను ప్రయత్నము. 2. ఉపాసనా వి (అ) బాహ్యోపాసన - కొంత ప్రాకృతిక విధానముతో ప్రారంభమై తాంత్రిక మార్గము నవలంభించుట (ఆ) అంతరోపాసన - అష్టాంగ యోగ మార్గము 3. జ్ఞాన వి. - మోక్ష విద్యారూపము. విచార వితర్క - వివేకముల వలన సిద్ధించును.

,, ఇచ్ఛలు : 1. సహజ ఇ. - ఆకలి దప్పి మొదలగు సహజమైన అవసరములు కలిగినప్పుడు తీర్చవలెనను చిత్తవృత్తి. 2 భోగ ఇ. - ఇహపరలోక భోగములను పొందవలెనను చిత్తవృత్తి, 3. మోక్ష ఇ. - సాధన చతుష్టయ సంపన్నుడై మోక్షము పొందవలెనను చిత్తవృత్తి.

,, ఈషణములు (ఈషణత్రయము) : 1. దారేషణ - భార్య మొదలైన స్త్రీల యందు ఆశ. 2. పుత్రేషణ - పుత్రుల (సంతానము) యందు ఆశ. 3. ధనేషణ - ధనము మొదలైన సంపదలందు ఆశ.

(ii) ఇష్ట క. — అగ్నిహోత్రాది కర్మలు. 2 పూర్త క. — వాపీ కూప తటాకాది నిర్మాణ కర్మలు 3. దత్త క. - గో సువర్ణ వస్త్రాదికాదులను సత్పాత్రుల కొసగు కర్మలు.

(iii) 1. సంచితము — అనేక జన్మలందు చేయబడి ఇంతవరకు అనుభవింపబడక సంస్కార రూపమునందు నిలిచి యుండునవి, 2. ఆగామి — వర్తమాన శరీరముతో ప్రస్తుతము చేయు కర్మలు ఫలితము ముందు జన్మలందు కలుగునవి. 3 ప్రారబ్ధము— పూర్వము చేయబడిన కర్మలతో వర్తమాన శరీరమునకు కారణమై యీ శరీరములో సుఖదుఃఖములను కలిగించునవి.

**త్రివిధ కాండములు** : 1. కర్మ కాం 2 ఉపాసనా కాం. 3 జ్ఞాన కాం (వేదములలోని భాగములు)

,, **కామ్య కర్మలు** : 1. కేవల ఐహిక క. — ఇహలోక సంబంధమైన కర్మలు 2 కేవల ఆముష్మిక క. — పరలోక సంబంధమైన కర్మలు. 3. ఐహికాముష్మిక క. — ఇహపరలోకములకు సంబంధించిన కర్మలు

,, **కాయిక పాపములు** : 1. చౌర్యము 2. నిషిద్ధ హింస 3 పరస్త్రీ సంగమము.

,, **కారణములు** : (i) 1. ఉపాదాన కా. — కార్యోత్పత్తికి కారణమై కార్యమునందు ప్రవేశించి యుండునది. ఉదా : కార్యమైన కుండకు ఉపాదాన కారణము మట్టి. 2. నిమిత్త కా. — కార్యోత్పత్తికి కారణమై కార్యము నందుండక వేరుగా యుండునది. ఉదా : కుండకు నిమిత్త కారణము కుమ్మరి. 3. సహకారి కా.— కార్యమునకు సహకరించునది. ఉదా : కుండను చేయుటకు సహకారి కారణము చక్రము.

(ii) 1. సమవాయి కా. — కార్యమునకు అవయవముగా నున్నది. ఉదా : కపాలములు కుండకు 2. అసమవాయి కా. — పటములకు తంతువుల సంయోగము, 3. నిమిత్త కా. — పై రెండును కాని కారణము. ఉదా : కుండకు కుమ్మరి.

**త్రివిధ కాలమానములు** : 1. మనుష్య మానము 2. దేవమా. 3 బ్రహ్మమా.

**త్రి కాలములు** (కాలత్రయము) : 1. భూత కా. – జరిగిపోయిన కాలము 2. వర్తమాన కా. – జరుగుతున్న కాలము 3. భవిష్యత్ కా. - జరుగబోవు కాలము.

**త్రివిధ గతులు** : 1. ఊర్ధ్వగతి 2. మధ్య గతి 3 అధోగతి,

**త్రి గుణములు** (గుణత్రయము) : 1. సత్త్వము – విశుద్ధము, నిర్మలము, జ్ఞానాసక్తి, సుఖాసక్తి కలిగించునది. 2. రజస్సు-రాగము మమకారము, కర్మయందు ఆసక్తి కలిగించునది. 3. తమస్సు– అజ్ఞానము, నిద్ర, సోమరితనము, పరాకు కలిగించునది.

**త్రివిధ గురువులు** : 1. చోదకులు _ కర్మ, ఉపాసనలు చేయ ప్రేరేపించువారు. 2. బోధకులు _ బ్రహ్మ సత్యత్వ, జగన్మిధ్యాత్వ, జీవ బ్రహ్మైకత్వ సిద్ధాంతమును పరోక్షముగా బోధించువారు. 3. మోచకులు – అద్వితీయ బ్రహ్మాత్మ అపరోక్ష ప్రబోధముతో అవిద్య, తత్కార్యరూప సంసారబంధ విమోచకులు.

,, **గ్రంథులు** : 1. బ్రహ్మగ్రంధి – అధార స్వాధిష్ఠానములు 2. విష్ణు గ్రం. – మణిపూరక, అనాహత కమలములు. 3. రుద్ర గ్రం. _ ఆజ్ఞా చక్రమునకు పైన త్రిపుటిరూప మూల ప్రకృతి ప్రదేశమున వుండునవి.

**త్రి జగత్తులు** : 1. స్వర్గము 2. భూమి 3. పాతాళము.

**త్రివిధ జపములు** : 1. మానసిక జ. _ మనస్సులోనే (నిశ్శబ్దముగా) జపించుట. 2. ఉపాంశు జ. – పెదవులను కొద్దిగా కదులుస్తూ తాను మాత్రము వినునట్లు జపించుట. 3. వాచిక జ. – వాగింద్రియముతో పెద్ద స్వరముతో స్పష్టముగా బయటకు వినబడునట్లు జపించుట.

,, **జీవులు** : 1. విశ్వుడు _ స్థూల శరీరాభిమాని 2. తైజసుడు – సూక్ష్మ శరీరాభిమాని 3. ప్రాజ్ఞుడు – కారణ శరీరాభిమాని.

త్రివిధ జ్ఞానములు : 1. సంజ్ఞానము – పద పదార్థ జ్ఞానము. 2. విజ్ఞానము – పద పదార్థములు చేరిన అభిప్రాయము. 3. ప్రజ్ఞానము - బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము.

,, తమోగుణములు : 1. అప్రతిపత్తి గు. – తెలియమి 2. విప్రతిపత్తి గు. – సరిగా తెలియమి. 3. విపరీత ప్రతిపత్తి గు. – విరుద్ధముగా తెలియుట.

,, తాదాత్మ్యములు : 1. సహజ చర్య తా. – అహంకార చిదాత్మలకు తాదాత్మ్యము. 2. కర్మజన్య తా. - దేహ చిదాత్మలకు తాదాత్మ్యము. 3. భ్రాంతి జన్య తా. – అధిష్ఠానమైన ఆత్మకు తానని తెలియనిదనము.

,, తాపములు (తాపత్రయము) : 1. ఆధ్యాత్మిక తా.- తన దేహేంద్రియాదులకు కలిగిన ఆధివ్యాధులచే దుఃఖించుట. 2. అధి భౌతిక తా. – తనకు అన్యులైన దారాపుత్రులకు కలిగిన ఆధివ్యాధులకు చోరసర్ప వృశ్చికాది బాధలకు దుఃఖించుట. 3. ఆధిదైవిక తా.- దైవికముగా కలిగిన అతివృష్టి, అనావృష్టి అత్యాతప అనాతప మొదలైన వాని వలన కలిగిన బాధలకు దుఃఖించుట.

,, దండములు : 1. వాగ్దండము – మౌనము 2. మనో దం.– ఆశ లేకుండుట 3. కాయ దం. – స్వధర్మాచరణము.

,, దీక్షలు : 1. దృగ్దీక్ష – చేప గ్రుడ్లను పెట్టి తాను ఆ గ్రుడ్లను తిరిగి చూచినప్పుడు చేప పిల్లలయినట్లు, శిష్యుని వుపదేశ కాలములో గురువు తన శిష్యుడు అపరోక్ష సాక్షాత్కార బ్రహ్మ భావము కలవాడగునట్లు దృష్టి చేతనే దీక్ష నిచ్చుట. 2. స్పర్శదీక్ష – పక్షులు గ్రుడ్లను పెట్టి వానిని రెక్కలతో కప్పినప్పుడు అవి పిల్లలుగా అవునట్లు, గురువు తన్నాశ్రయించిన శిష్యుని శరీరమును తన చేతితో తాకుట ద్వారా దీక్ష నిచ్చుట. 3. వాగ్దీక్ష – భ్రమరము కీటకమును తీసికొనిపోయి దాని చెవిలో కూసి కూసి తన రూపము వలె చేసికొనునట్లు గురువు శిష్యునికి బోధించి తనవలె చేసికొనుట.

త్రివిధ దేహ జ్వరములు : 1. స్థూల దేహ జ్వ _ వాతపిత్త శ్లేష్మాది వ్యత్యాసముల వలన కలుగు జ్వర అతిసారాది వ్యాధులు. 2. సూక్ష్మదేహ జ్వ. – కామరాగాది దుర్గుణములు 3. కారణ దేహ జ్వ. – స్వపరిజ్ఞప్తి శూన్యత, ఆగామి దుఃఖ బీజ వాసనలు, అజ్ఞానముచే నష్ట ప్రేయత్వము.

,, దేహములు (దేహత్రయము) : 1. స్థూల దే. – అన్నమయ కోశము. 2. సూక్ష్మ దే. - ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు. 3. కారణ దే. – ఆనందమయ కోశము.

,, పద సంబంధములు : 1. సమానాధికరణ్య సం. - భిన్న ప్రవృత్తి ధర్మములు (భిన్నార్థములు) గల పదములు ఒకే వస్తువును నిర్దేశించుట. 2. విశేషణ విశేష్యభావ సం. – విశేషణము విశేష్యమునందు అభేదముతో అన్వయించుట. 3. లక్ష్య లక్షణ సం. – లక్షకములైన పదములకు (శబ్దములు) లక్ష్యములైన (అర్థములు) సంబంధము.

,, పరమేశ్వర రూపములు : 1. స్థూల రూ. – మధ్యమాధికారులచే వుపాసింపబడ తగినది. 2. సూక్ష్మ రూ. – ఉత్తమాధికారులచే వుపాసింపబడ తగినది (మంత్రరూపము). 3. కారణ రూ. - ఉత్తమోత్తమాధికారులచే ఉపాసింపబడ తగినది (యంత్ర రూపము).

,, పరస్పర వస్తు సంబంధములు : 1. సంయోగ సం. _ రెండు సమాన సావయవ వస్తువుల మధ్య నుండునది. 2. సమవాయ సం. _ అవయవము అవయవి మొదలగు వాటి మధ్య నుండు అవినాభావ సంబంధము. 3. తాదాత్మ్య సం. – అభిన్నత్వము.

,, ప్రణవ పాదములు : 1 'అ' కారము - వ్యాప్తి మొదలగుట. స్థూల ప్రపంచము. 2. 'ఉ' కారము — ఉత్కృష్టము ఉభయత్వము, సూక్ష్మ ప్రపంచము. 3. 'మ' కారము – కొలువబడుట, ఏకీభావము నందుండుట, కారణ ప్రపంచము.

త్రివిధ ప్రతిబంధములు : 1. భూత ప్ర. _ గడచిపోయిన విషయములు జ్ఞప్తికి వచ్చుట. 2. వర్తమాన ప్ర. — విషయాసక్తి, ప్రజ్ఞా మాంద్యము, కుతర్కము, విపర్యయ దురాగ్రహము. 3. భవిష్యత్ ప్ర. — పాప కర్మవలన ఏ వేళ ఏది వచ్చునది తెలియకపోవుట.

,, ప్రమాణములు : 1. ప్రత్యక్ష ప్ర. — ఇంద్రియముల వలన గ్రహింపబడునది. 2, అనుమాన ప్ర, — రెండు నియత సంబంధము గల పదార్థములలో ఒకటి ప్రత్యక్షమై రెండవది ప్రత్యక్షము కాకున్నను వున్నదని నిర్ణయించుట, 3. శృతి ప్ర, — పై రెండు ప్రమాణముల వలన తెలియని దానిని బోధించు శాస్త్ర (వేద) వాక్యము.

,, ప్రసాదములు : 1. శుద్ధము — గురుభుక్త శేషము 2. సిద్ధము — ఈశ్వరభుక్త శేషము 3. ప్రసిద్ధము — భగవద్భక్తుల భుక్త శేషము.

,, ప్రస్థానములు (ప్రస్థానత్రయము) : 1. శృతి ప్ర. - ఉపనిషత్తులు 2. స్మృతి ప్ర._ భగవద్గీత 3. న్యాయ ప్ర._బ్రహ్మ సూత్రములు

,, ప్రాణాయామములు : 1. పూరకము - ప్రాణాయామములో గాలిని లోపలకు పీల్చుట. 2. రేచకము — గాలిని తిరిగి బయటకు వదలుట. 3. కుంభకము — గాలిని లోపల నిలుపుట.

,, ప్రారబ్ధములు : 1. స్వేచ్ఛా ప్రా. _ తన ఇష్టానుసారము చేయు కర్మ. 2. పరేచ్ఛా ప్రా. — ఇతరుల ప్రేరణచేత చేయు కర్మ 3. అనిచ్ఛా ప్రా. — దైవేచ్ఛచేత జరుగు కర్మ

,, బ్రహ్మవేత్తల వృత్తులు : 1. దిగంబర వృ. _ వస్త్రహీనులై యుండుట. (కౌపీనము కూడ వదలియుండుట) 2. సాంబర వృ. - వస్త్రధారులై యుండుట. (లోపల కౌపీనముంచుకొనక నార చీరలు కప్పుకొని యుండుట) 3. త్వగంబర వృ. — చర్మధారులై యుండుట. (లోపల కౌపీనము లేకయే చర్మమును కప్పుకొని యుండుట.

త్రివిధ భక్తులు : (i) 1. బాహ్య భ _ పరోక్ష జ్ఞానమునకు కారణమగునది. 2 అనన్య భ. – అపరోక్ష జ్ఞానమునకు కారణమగునది. 3. ఏకాంత భ.- నిశ్చయ జ్ఞానము కలుగు నిత్యానందమునకు కారణ మగునది.

(ii) 1. వైదీ భ. _ శ్రవణ కీర్తనాదులతో భగవత్ప్రేమను అభ్య సించుట. 2 రాగాత్మికా భ. – దాస్య సఖ్యాది భావములతో భగ వత్ప్రేమలో మునిగిపోవుట. 3. పరా భ. – సర్వత్ర పరమాత్మని అనుభవము పొందుట.

,, భగవద్బోధ విశేషణములు : 1. పరమ వచనము _ అధి కారముతో కూడిన వాక్కు. 2. గుహ్య వచనము - అధికారులకు మాత్రము అందుబాటులోనుండు వాక్కు. 3. అధ్యాత్మ సంజ్ఞి తము – ఆత్మజ్ఞాన ప్రబోధమైన వాక్కు.

,, భావనలు : 1. సంశయ భా – నేను ఆత్మ స్వరూపుడను అవునా కాదాయను బుద్ధి. 2. అసం భా. _ ఆత్మయేనేనైతే సుఖదుఃఖాది ద్వంద్వములు ఉండకూడదు కదాయను భావన. 3. విపరీత భా. – ఆత్మను మరచి తన్నే కర్తగా భావించుకొను బుద్ధి.

,, భాషలు : 1. లౌకిక భా. _ ప్రపంచ వ్యవహారమునకు సంబం ధించిన భాష. 2. కావ్య భా. – కావ్యములలో ఉపయోగింపబడే భాష. 3. తాత్త్విక భా. – తత్త్వ బోధకమైన భాష.

,, భేదములు : 1. సజాతీయ భే.– ఒకే జాతిలో నుండు భేదములు 2. విజాతీయ భే. _ భిన్న జాతుల మధ్య నుండు భేదములు. 3. స్వగత భే.–తనలోగల అంతర్భాగములో నుండు భేదములు.

,, మంగళాచరణ ప్రయోజనములు : 1. శిష్టాచార సాంప్ర దాయ రక్షణ. 2. అరంభించిన కార్యము నిర్విఘ్నముగా జరు గుట. 3. చెప్పేవారి యొక్క చిత్తము ఏకాగ్రమై అంతర్ముఖ మగుట.

**త్రివిధ మంగళాచరణములు** : 1 వస్తు నిర్దేశరూప మం. - ప్రారంభములో ఒక ఉత్తమ వస్తువును నిర్దేశించుట. 2 నమస్కార రూప మం - కార్య ప్రారంభములో తన ఇష్టదైవమునకు గాని సద్గురువుకు గాని నమస్కారములు చెల్లించుట. 3. ఆశీర్వాద రూప మం.- తమకు తమ శిష్యులకు తమ అనుయాయులకు జయమును కోరుట.

**త్రి మతములు** (మతత్రయము) : 1. ద్వైతము - స్వతంత్ర తత్త్వము, అస్వతంత్ర తత్త్వము అను రెంటిని అంగీకరించునది (జీవేశ్వరాదీ భేద నిర్ణయము) 2. విశిష్టాద్వైతము _ స్వభిన్న చేతనాచేతన విశిష్టమైన బ్రహ్మమును ప్రతిపాదించునది. (స్థూల చిదచిదాత్మకి శరీర విశిష్ట కారణ పరమాత్మకును సూక్ష్మ చిదచిదాత్మకి శరీర విశిష్ట కార్య పరమాత్మకును నైక్యము) 3. అద్వైతము - నిర్గుణమును సచ్చిదానంద స్వరూపమును అయిన బ్రహ్మము ఒక్కటేయని ప్రతిపాదించునది. (స్వజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యత)

**త్రివిధ మదములు** : 1. విద్యా మదము 2. ధన మదము 3. కుల మదము

,, **మలములు** : 1. ఆవరణ మ. - పరమాత్మను తెలియలేక తాను జీవుడను, అజ్ఞానిని అని భావించుట. 2. కార్మిక మ. - పుణ్య కర్మ బుద్ధి వలన తాను కర్మఠుడు అవుట. 3. మాయిక మ. - పరులకు మనోవాకాయములతో అపకారము చేయుచు వారు వేరు తాను వేరు అను భిన్నభావముతో ప్రవర్తించుట.

,, **మార్గములు** (జ్ఞానమును ఆర్జించునవి) : 1. ప్రణామ మొనర్చుట 2. ప్రశ్నించుట 3. సేవ చేయుట.

,, **ముక్తులు** : 1. క్రమ ము. _ సాధన చతుష్టయ సంపద కలిగి ఆత్మజ్ఞానము పొందుట ద్వారా ముక్తిని పొందుట. 2. జీవన్ము. - జీవించి యుండగానే అపరోక్ష జ్ఞానముచే ముక్తిని పొందుట. 3. విదేహ ము. - దేహ పతనానంతరము ముక్తిని పొందుట.

**త్రివిధ ముఖ్య నాడులు** : 1. ఇడ నా. _ ఎడమ నాసికా రంధ్రమున సున్నది. 2. పింగళ నా. – కుడి నాసికా రంధ్రమున సున్నది. 3 సుషుమ్న నా - ఇడ, పింగళల మధ్య నుండే సుసూక్ష్మమైనది.

,, **మూఢులు** : 1. రాక్షసులు – హింసా ద్వేషములు స్వభావముగా కలిగి, నిష్కారణముగా ఇతరులను పీడించువారు. 2. అసురులు- తమ ప్రాణముల తృప్తి కొరకు మాత్రమే జీవించువారు. తమ బ్రతుకు కొరకు ఇతరులకు ఎట్టి క్లేశమైనను కలిగించువారు 3. మోహినులు _ వివేక జ్ఞానములేక తెలియకనే ఇతరులకు కష్టము కలిగించువారు.

**త్రి మూర్తులు** : 1 బ్రహ్మ _ సృష్టికర్త 2. విష్ణువు – స్థితికర్త 3. మహేశ్వరుడు _ లయకర్త.

**త్రివిధ (సృష్టికి) మూల ద్రవ్యములు (త్రివృత్కరణ పద్దతి)** : 1. తేజస్సు 2. జలము 3. పృధివి.

,, **మోక్ష మార్గములు** : 1 కర్మ 2. భక్తి 3. జ్ఞానము.

,, **మౌనములు** : 1. వాక్ మౌ. - వాక్కును నియతిగా నుంచుకొనుట. 2 అక్ష మౌ. – చతుర్దశేంద్రియములను విషయాదుల లోనికి పోనీయక పరబ్రహ్మములోనే లయము చేయుట 3. కాష్ఠ మౌ. – శరీరమును మూలబంధ ఉడ్యాణ జలంధర బంధముల తోను, పద్మాసనాది ఆసనముల చేతను క్రమముగా నిలుపుకొనుట.

,, **యుక్తులు** : 1. కార్యకారణ యు. – కార్యకారణ అభేదములను తెలుపునది. ఉదా : మట్టి కన్న కుండ వేరుకాదు. 2. పరిణామ యు – మార్పులోని అభేదమును తెలుపునది. ఉదా : పాలకన్న పెరుగు గాని, వెన్నగాని (రూపాంతరమే గాని) వేరుగా లేదు 3 వివర్త యు. – కల్పింపబడిన వస్తువు వేరు కాదని తెలుపునది. ఉదా : త్రాడును చూచి పామనుకొనుట భ్రాంతి (రజ్జుసర్ప భ్రాంతి).

**త్రివిధ రాజయోగ శాఖలు :** 1. సాంఖ్యము – ప్రకృతి పురుష వివేకము. 2. తారకము–యమనియమాది అష్టాంగ యోగములు కలిగినది. 3. అమనస్కము – అష్టాంగ యోగానంతరము అనుష్ఠింపదగినది.

,, **లక్షణావృత్తులు :** 1. జహత్ ల.వృ – వాచ్యాంశమును విడిచి ముఖ్యాంశమును మాత్రమే గ్రహించుట. ఉదా : గంగయందు గొల్లపల్లె. 2. అజహత్ ల.వృ. - వాచ్యాంశమును విడువకుండ ముఖ్యాంశమును గ్రహించుట. ఉదా : కత్తులు పోట్లాడుచున్నవి. 3. జహత్ అజహత్ ల.వృ. – వాచ్యాంశమును విడిచి విడువక అనగా కొంత భాగమును విడిచి మరియొక భాగమును గ్రహించుట. ఉదా ; ఆ కాకి వాలినది దేవదత్తుని ఇల్లు.

,, **లక్షణ దోషములు :** 1. అతివ్యాప్తి - చెప్పిన లక్షణము లక్ష్యేతరమునగూడ సమన్వితమగుట. 2. అవ్యాప్తి – చెప్పిన లక్షణము కొన్ని లక్ష్యములలో లేకుండుట. 3. అసంభవము – చెప్పిన లక్షణము లక్ష్యమున నెక్కడను లేకుండుట.

**త్రి లింగములు :** 1. పుంలింగము - సత్త్వ రజస్తమోగుణములలో (త్రిగుణములలో) సత్త్వోద్రేకము గలది. 2. స్త్రీ లింగము – త్రి గుణములలో రజోగుణోద్రేకము గలది. 3. నపుంసక లింగము - త్రిగుణములలో తమోగుణోద్రేకము గలది.

**త్రివిధ వాక్య లక్షణములు :** 1. ఆకాంక్ష – వాక్యములోని పదములు క్రియా కాంక్షను పూరించినవగుట. 2. యోగ్యత _ పదార్థముల పరస్పర సంబంధమునకు బాధ లేకుండుట. 3. సన్నిధి – వాక్యములోని పదముల యవిలంబోచ్చారణము. (పదముల చేరిక)

,, **వాదములు :** 1. వాదము – యథార్థమును నిర్ణయించుట కొరకు వాది ప్రతివాదులు చేయునది. (తత్త్వనిర్ణయ ఫలక కథనము) 2. జల్పము - తమ వాదమే జయింపవలెనని చేయు ప్రస్తావము. (పరపక్ష నిరాకరణ పూర్వకముగా స్వపక్ష స్థాపకమగు విజిగీషు

కథనము) 3. వితండము _ పరపక్షమును దూషించుటకు చేయు ప్రసంగము. (స్వపక్షము లేకయే పరపక్ష ఖండన మాత్రము నుద్దేశించిన వాదోపవాదము)

**త్రివిధ వాసనలు** 1 దేహ వా — స్థూలదేహము మీద నుండు అభినివేశము. 2. లోక వా. — ప్రజలచే నిందకు లోనుగాక స్తుతింపబడవలెనను విధముగా ప్రవర్తించుట. 3. శాస్త్ర వా. — శాస్త్ర తాత్పర్యమును గ్రహింపక శాస్త్ర అధ్యయనాదులలో ఆసక్తుడై యుండుట.

,, **వేదకాండలు** : 1 కర్మ కాం. 2 ఉపాసనా కాం. 3. జ్ఞాన కాం.

,, **వేద మంత్రములు** : 1. ఋక్కులు— ఋగ్వేదములోనివి. దేవతలను స్తుతించుటకు ఛందోబద్ధమై శ్లోక రూపమున నున్నవి. 2. యజస్సులు — యజుర్వేదములోనివి. దేవ పూజకు దేవతలకు హవిస్సులను సమర్పించుటకు ఉపయోగించు వచనాత్మకమగు మంత్రములు. 3. సామలు — సామవేదములోనివి. యజ్ఞాచరణములో రాగబద్ధముగా గానము చేయబడు ఋక్కులు.

,, **వైశ్య కర్మలు** : 1. కృషి 2. గోరక్షణము 3. వ్యాపారము.

,, **వైరాగ్యములు** (తాత్కాలికమైనవి) : 1. పురాణ వై. _ పురాణ గాధలు వినునప్పుడు కలుగు వైరాగ్యము. 2. ప్రసూతి వై. — ప్రసూతి సమయమున కష్టము భరించలేక కలుగునది. 3. శ్మశాన వై. — తమకు ప్రియమగువారు చనిపోయినప్పుడు శవముతో శ్మశానమునకు వెళ్లునప్పుడు కలుగునది.

,, **శరణాగతులు** : 1. తస్యైవాహం — నీవు (భగవంతుడు) నా (తన) వాడనెడు భావము. విశ్వాత్ముడను నేనే యను భావము. 2. తవైవాహం - నేను (తాను) నీ (భగవంతుని) వాడనను భావము. 3. త్వమేవాహం — నీవే (భగవంతుడే) నేను (తాను) అనెడి భావము. నీతో నభిన్నుడను నేను అను భావము.

,, **సత్తలు** (సత్తాత్రయము) : 1. పారమార్థిక స.-బ్రహ్మ చైతన్యము కాలత్రయములో దేనిచేతను బాధింపబడనిది. 2. వ్యావహారిక

స. — జగత్తు బ్రహ్మజ్ఞానము కలుగక పూర్వముండి బ్రహ్మ జ్ఞానము కలుగగనే బాధింపబడునది 3 ప్రాతిభాసిక స. — స్వప్నము మొదలైనవి. (బ్రహ్మజ్ఞానము లేకయే) వ్యావహారిక జ్ఞానముచే బాధింపబడునది

**త్రివిధ సత్సంగములు** : 1. సత్య స్వరూప పరమాత్మతో సాంగత్యము. 2 సంత పురుషులతో సాంగత్యము. 3. సచ్ఛాస్త్రముల అభ్యాసము

,, **సన్యాసములు** : 1. బాహ్య స. — బాహ్య పదార్థ రూప దృశ్యము నంతయు వదలుట. 2. మానసిక స. — మనస్సుకు సంబంధించిన వృత్తులను గుణములను సంస్కారములను విసర్జించుట. 3. ఆత్మ స. — మనస్సును కూడ వదలి అనాత్మభావనను పూర్తిగా నశింపజేసి మనోతీతమగు పరబ్రహ్మమే తానై యుండుట.

,, **సాధనములు** : 1. శ్రవణము — గురువు ద్వారా వేదాంతము వినుట. 2. మననము — వినిన దాని అర్థము యొక్క సాధక బాధకములు విచారించి నిశ్చిత అభిప్రాయమును పలుమారు విచారించుట. 3. నిదిధ్యాసన — ఏకాగ్ర చిత్తముతో మననము చేయుటవలన "నేనే బ్రహ్మమును" అను ఆనందము పొందుట.

,, **స్వర భేదములు** : 1. ఉదాత్తము - తాలువు మొదలగు స్థానములకు పై భాగములో పుట్టిన అచ్చు. 2. అనుదాత్తము - తాలువు మొదలైన వాటికి దిగువ పుట్టిన అచ్చు. 3. స్వరితము— ఉదాత్త అనుదాత్త ధర్మములు రెండును కలిసియున్న అచ్చు

# 4. చతుర్

**చతుర్విధ అంతఃకరణములు** : 1. మనస్సు 2. బుద్ధి 3. అహంకారము 4. చిత్తము.

**చతుర్విధ అగ్నులు :** (i) 1. దీపాగ్ని 2. కమలాగ్ని 3. మందాగ్ని 4. గాఢాగ్ని.

(ii) 1. బడబాగ్ని 2. జఠరాగ్ని 3. గృహాగ్ని 4. వైద్యుతాగ్ని.

(iii) 1. విషయాగ్ని 2. తీక్షణాగ్ని 3. మందాగ్ని 4. సమాగ్ని

(iv) 1. భౌమాగ్ని 2. అబింధనాగ్ని 3. జౌదర్యాగ్ని 4. ఆకరజాగ్ని.

1. భౌమాగ్ని – భూమి యందుండునది. 2. అబింధనాగ్ని – నీటి (బుగ్గల) యందుండునది. 3 జౌదర్యాగ్ని – జఠరము నందుండునది. 4. ఆకరజాగ్ని – గనులలో నుండి రత్న లోహాదుల నిర్మాణము చేయునది.

,, **అనంతములు :** 1. అనంత జ్ఞానము 2. అనంత దర్శనము 3. అనంత వీర్యము 4. అనంత సుఖము.

,, **అనాత్మ లక్షణములు :** 1. అసత్తు 2. జడము 3. దుఃఖము 4. సద్వితీయము.

,, **అనుబంధములు** (అనుబంధ చతుష్టయము) : 1. అధికారి – గ్రంథము (శాస్త్రము) తెలిసికొనుటకు అర్హత కలవాడు. 2. విషయము – గ్రంథములోని తెలిసికొనవలసిన విషయము. 3. సంబంధము – గ్రంథమునకు విషయమునకు మధ్యగల సంబంధము 4. ప్రయోజనము – గ్రంథము తెలిసికొనినందువలన కలుగు ఫలము.

,, **అనుభవ హేతువులు** (ప్రమాణములు) : 1. ప్రత్యక్షము – ఇంద్రియముల ద్వారా ప్రత్యక్షముగా తెలియదగినది. 2. అనుమానము – నియత సంబద్ధములలో నొక దానితో మరొక దాని నూహించుట. 3. ఉపమానము – నియత సంబద్ధములలో నొక దానిని మరియొక దాని పోలికతో నిజమును తెలియుట. 4. శాబ్దము – శాస్త్రమందు గాని అప్తునిచే చెప్పబడిన దానిని గాని విశ్వసించి గ్రహించునది.

**చతుర్విధ అపరా వైరాగ్యములు :** 1. యతమానము – సారా సారములను తెలిసికొనవలెను ప్రయత్నము. 2. వ్యతిరేకము - వివేకాభ్యాసముతో త లోని మోహము "ఇంత తగ్గినది" "ఇంత మిగిలినది" అని వివేచించుకొనుట. 3. ఏకేంద్రియము – దోష దర్శనముతో విషయములను త్యాగము చేయుట 4. వశీకారము– విషయ తృష్ణ పూర్తిగా నివర్తించుట.

,, **అభావములు :** 1. ప్రాగభావము – అనాదియై యంతము గలది. ఉదా ; ఘటము పుట్టక ముందుండును. (ఇచ్చట ఘటము పుట్టనున్నది యను యభావము) 2. ప్రధ్వంసాభావము – సాదియై అంతము లేనిది. ఉదా : ఘటము పగిలినప్పుడుండునది. (ఘటము పగిలినది యన్న యభావము). 3. అన్యోన్యాభావము - ఒక వస్తువునందు మరొక వస్తువు లేమి. ఉదా : ఘటమున పటము లేదు. 4. అత్యంతాభావము – త్రైకాలికా బావము. ఉదా: భూమి యందు ఘటము లేదు అను భావము.

,, **అవతార ప్రయోజనములు :** 1. దుష్ట శిక్షణ 2 శిష్ట రక్షణ 3. ధర్మ సంస్థాపన 4. అధర్మ నిర్మూలన.

,, **ఆకాశములు :** 1. మహాకాశము - శుద్ధమైన ఆకాశము. 2. మేఘాకాశము – మేఘమండలి జల బిందువులలో ప్రతిబింబించు ఆకాశము. 3. ఘటాకాశము – శూన్యమైన కుండలోని ఆకాశము 4. ఘట జల ప్రతిబింబాకాశము – కుండలోని జలమందు ప్రతిబింబించు ఆకాశము.

,, **ఆత్మ పాదములు** 1. విశ్వుడు – జాగ్రదవస్థలో స్థూల శరీరమును అభిమానించునది. 2. తైజసుడు – స్వప్నావస్థలో సూక్ష్మ శరీరమును అభిమానించునది. 3. ప్రాజ్ఞుడు – సుషుప్త్యావస్థలో కారణ శరీరమును అభిమానించునది 4. ప్రత్యగాత్మ – తురీయావస్థలో నుండునది.

**చతుర్విధ ఆత్మ లక్షణములు :** 1. సత్తు – త్రికాలములలో నిత్యమై యుండునది 2 చిత్తు–స్వయం ప్రకాశమైనది. 3. ఆనందము-ఎల్లప్పుడు ఆనందస్థితిలో నుండునది. 4. అద్వితీయము _ ఏకమై రెండవది లేనిది

,, **ఆరాధనా వస్తువులు :** 1 పత్రము 2. పుష్పము 3. ఫలము 4 జలము.

,, **ఆశ్రమములు :** 1. బ్రహ్మచర్యము – మొదటి 20 సం॥లు గురువువద్ద లౌకిక వైదిక పారమార్థిక విద్యలను అభ్యసించి వాటి ఆచరణమును పూనుకొనుట. 2. గృహస్థము – బ్రహ్మచర్యము తరువాత దేవ పితృఋషి మొదలైన యజ్ఞములు చేయుచు ధర్మ యుక్తముగా వివాహిత జీవనము గడుపుట 3. వానప్రస్థము – 50 సం॥లు దాటిన వెనుక సాంసారిక జీవితమును విడిచి వనమున పారమార్థిక జీవనము గడుపుట. 4. సన్యాసము – సర్వ సంగ పరిత్యాగము చేసి ఆత్మ పదార్థమును తెలిసి జీవితాంతము వరకు నుండుట.

,, **ఆహారములు :** 1. భక్ష్యములు–విరిచి నమలి తిను పదార్థములు. 2 భోజ్యములు - ఉండలుగా చేసికొని తిను పదార్థములు 3. లేహ్యములు - నాకి తిను పదార్థములు. 4. చోష్యములు –జుర్రు కొని తిను పదార్థములు.

,, **ఉపసర్గలు** (ఉపసర్గ చతుష్టయము) **:** 1. ఆధి - మానసిక వ్యాధి. 2. వ్యాధి – శారీరిక రోగము. 3. ఉపాధి – ఆధారము (ఆశ్రయము) 4. సమాధి – చిత్తైకాగ్రత.

,, **ఉపాంగములు :** 1. మీమాంస 2. న్యాయ శాస్త్రము 3. పురాణము 4. ధర్మ శాస్త్రము.

,, **ఉపాయములు :** 1. సామము – సామ వచనముల నుభయుల సమప్రత్వ ప్రతిపత్తితో మెలగుట. 2. దానము – ఏమైన నిచ్చి

తన స్థితిని నిలువుకొనుట. 3. భేదము _ మిత్రులైన యుభయులకు విరోధమును కల్పించి బలహీనులజేసి అ ఉభయుల (జంపి) యధికారి యగుట 4. దండము _ యుద్ధము ప్రకటించి దండెత్తుట.

,, **ఋత్విక్కులు** : 1. హోత - యజ్ఞములో ఋగ్వేద మంత్రమును చదువువాడు. 2. ఉద్గాత _ యజ్ఞములో సామవేద మంత్రములను గానము చేయువాడు. 3. అధ్వర్యుడు - యజ్ఞములో యజుర్వేద మంత్రములను పఠించువాడు. 4. బ్రహ్మ - యజ్ఞములో అథర్వవేద మంత్రముల నుచ్చరించువాడు.

,, **కర్మ ఛండాలురు** : 1. దూషకుడు 2. క్రియా శూన్యుడు 3. నికృష్టుడు 4. దీర్ఘకోపనుడు.

,, **కర్మానుష్ఠానులు** : 1. కర్మాతీతులు - జీవన్ముక్తులు జ్ఞానాగ్నిచే కర్మలు దగ్ధమైన వారు. 2. నిష్కామ కర్మానుష్ఠానులు-నిష్కామముగా కర్మ చేయువారు-ముముక్షువులు. 3. కామ్య కర్మానుష్ఠానులు – కామ్య బుద్ధితో కర్మ చేయువారు. 4. కర్మభ్రష్టులు – ధర్మము పుణ్యము పాపము లేక స్వేచ్ఛగా తిరుగువారు.

,, **కర్మలు** : 1. కృచ్ఛము - దాన వ్రతాదికము 2. చాంద్రాయణము చంద్రకళల వృద్ధిక్షయముల ననుసరించి దినమున కొక కబళము చొప్పున హెచ్చు తగ్గులుగా భుజించెడి వ్రత విశేషము. 3 నిత్య కర్మానుష్ఠానము – విధి విహితములగు నిత్య కర్మల నొనర్చుట. 4. నైమిత్తిక కర్మానుష్ఠానము – తిథులకు కాలములకు అర్హమైన కర్మ నొనర్చుట.

,, **కళలు** : (i) నిశ్శబ్ద మార్గమున - 1. అవాపము 2. నిష్క్రామము 3 విక్షేపము 4. ప్రవేశము.

(ii) సశబ్ద మార్గమున : 1. ధ్రువము 2. శమ్యము 3. తాళము 4. సన్నిపాతము.

చతుర్విధ క్రతువులు : 1. ప్రథమ దష్టోమము 2. ద్వితీయోష్యము 3 తృతీయాతిరాత్రము 4 జ్యోతిష్టోమము.

,, క్షేత్రజ్ఞగుణములు : 1. సాక్షి — వేరుగా నుండి చూచువాడు. 2 అనుమోదకుడు — అంగీకరించువాడు. 3. భర్త - భరించువాడు. 4 భోక్త — అనుభవించువాడు.

,, గుణ ధర్మలు : 1. ఉత్పత్తి — పుట్టుక. 2. ఆస్తి — లాభము పొందుట. 3 వికృతి — మార్పు 4. సంస్కృతి — చక్కదిద్దుట.

,, గురు దృష్టులు : 1. వీక్షణ దృ. — చేప చూపుచేత గ్రుడ్లను పిల్లలుగా చేయుట. గురువు వీక్షణముచే శిష్యుని జ్ఞానవంతముగా చేయుట 2. ధ్యాన దృ — తాబేలు చింతచేత గ్రుడ్లను పిల్లలుగా చేయుట గురువు సంకల్ప శక్తిచే శిష్యుని అజ్ఞానమును తొలగించుట. 3 సంస్పర్శ దృ. — పక్షి స్పర్శచేత గ్రుడ్లను పిల్లలుగా చేసి పోషించుట. గురువు హస్త సంయోగముచె శిష్యునకు బోధించుట 4. బోధ దృ. గురువు మంత్రోపదేశ రూపమైన బోధతో శిష్యుని జ్ఞానవంతుని జేయుట.

,, గురు శుశ్రూషలు : 1. ఆత్మ శు. — గురువు చెప్పిన తాత్పర్యమందు నిష్ఠ కలిగియుండుట. 2. అంగ శు. — గురుమూర్తి దేహమునకు సంబంధించిన అభ్యంజన పదసేవ అలంకారాదులు చేయుట 3. స్థాన శు. — గురుదేవుడుండు స్థానములో సమ్మార్జన ఇత్యాది స్థాన పరిశుభ్రతాది కార్యములు చేయుట. 4. భావ శు.— గురువే సాక్షాత్ పరబ్రహ్మమని భావించుట.

,, గురూపదేశ మార్గములు : 1. గురువును సమీపించుట. 2. విధేయతతో నమస్కరించుట. 3. పలువిధముల సేవ చెయుట. 4. ఉచిత సమయమందు ప్రశ్నించుట.

,, **చర్యాపాదములు** (చర్యాపాద చతుష్టయము) : 1. చర్యాపాదము దేవాలయ దర్శనార్థముగా సంచరించుట. 2. క్రియా పా: — తన

ఇష్ట దేవతలను ఆరాదించుట. 3. యోగ పా – తన ఇష్ట దేవత లను ధ్యానించుట. 4. జ్ఞాన పా – సర్వము తన ఇష్ట దేవతా స్వరూపమని నిశ్చయించుకొనుట.

**చతుర్విధ చైతన్యములు :** 1. ప్రమాతృ చై. – అంతఃకరణ విశిష్టము. 2. ప్రమేయ చై. – ఘటాది ప్రమేయ అవచ్ఛిన్నము. 3. ప్రమాణ చై. – వృత్తి విశిష్టము. 4 ప్రమా చై. – ఘటాది విషయాకార వృత్తియందు ఆరూఢమైనది

,, **జంతు సామాన్య ధర్మములు :** 1. ఆహారము 2 నిద్ర 3. భయము 4. మైధునము.

,, **జ్ఞాతులు :** 1. సపిండులు 2. సూదకులు 3. సగోత్రులు 4. సనాభులు.

,, **జ్ఞానయోగ విధులు :** 1. వితర్కము - స్థూల సూక్ష్మకారణ చైతన్యములతో అనుగతమైనది. 2. విచారము – సూక్ష్మకారణ చైతన్యముల కూటి చేతనే అనుగతమైనది. 3. వివేకము – కారణ చైతన్యముల రెంటి చేతనే అనుగతమైనది. 4. నిర్బీజము- కైవల్యరూపము, ఫలభూతము, సాధ్యరూపములతో లెక్కింపబడినది.

,, **తమోగుణ లక్షణములు :** 1. అప్రకాశము – ప్రకాశము (జ్ఞానము, శక్తి, ఆనందము) లేకపోవుట. 2. అప్రవృత్తి – చేయవలసిన పనులు చేయుటకు ఇష్టము లేకపోవుట. 3. ప్రమాదము – ఏమి చేయుటకు తోచక ఎక్కువ కాలము గడుపుట 4. మోహము – మూఢత్వము.

**చతుర్ దిశలు :** 1. తూర్పు 2 పడమర 3. దక్షిణము 4. ఉత్తరము.

**చతుర్విధ దుఃఖములు :** 1. సహజ దుః. 2. శారీరక దుః 3. మానసిక దుః. 4. ఆగంతుక దుః.

చతుర్విధ దుర్లభ్యములు : 1. ప్రియ వచనములతోడి దానము. 2. గర్వ రహితమైన జ్ఞానము 3. క్షమా సహితమైన శౌర్యము. 4. త్యాగయుక్తమైన విత్తము.

,, దృష్టాంత చిత్రపటు వస్త్రములు : 1. శుభ్ర వ. - చిత్రము వేయుటకొరకు తెచ్చినది. మాయారహిత బ్రహ్మము. చిత్తు. 2. ఘటిత వ. - గుడ్డను గట్టి చేయుటకు గంజి పెట్టినది అంతర్యామి. 3. లాంఛిత వ. - గంజి పెట్టబడిన వస్త్రముమీద రంగులు రేఖా మాత్రముగా (నదులు పర్వతములు మొదలైనవి) గుర్తులు పెట్టుట సూత్రాత్మ. 4. రంజిత వ - గుర్తులు ప్రకారము అకృతులకు రంగులు పూయుట. విరాట్.

,, ధన దాయాదులు : 1. ధర్మము 2. అగ్ని 3. ప్రభువు 4. తస్కరుడు

,, ధర్మదేవతలు : 1. అహింస 2. సత్యము 3. దయ 4. శాంతి.

,, ధ్యానములు : 1. పరస్థ ధ్యా 2. పిండస్థ ధ్యా. 3. రూపస్థ ధ్యా 4. రూపాతీత ధ్యా.

,, ద్వారపాలకులు (మోక్షమునకు) : 1. శాంతి 2. విచారము 3. సంతోషము 4. సత్పురుష సమాగమము.

,, నమస్కారములు : 1. సాష్టాంగ న. - ఎనిమిది అంగములు (రొమ్ము, శిరస్సు, రెండు కాళ్లు, రెండు చేతులు, రెండు చెవులు) దండమువలె నేలమీద మోపి నమస్కరించుట. 2 పంచాంగ న.- అయిదు అంగములు (శిరస్సు, హస్తములు, బాహువులు, కర్ణములు, జానువులు) నేలమీద మోపి నమస్కరించుట 3. త్ర్యంగ న. - రెండు చేతులను ముకుళించి శిరస్సునందుంచునికొ నమస్కరించుట. 4. ఏకాంగ న. - శిరస్సు మాత్రము వంచి నమస్కరించుట.

,, పద అర్థ విచారణ విధములు : 1. అన్వయము [ఇది- ఇట్లున్నదని చెప్పుట. 2. వ్యతిరేకము - ఇది ఇట్లు కాదని పదార్థ

మును వేరుచేసి చెప్పుట. 3. శ్రుతి – శ్రుతిలోని వాక్యములను బట్టి నిర్ణయించుట. 4 యుక్తి – వాదము ద్వారా నిర్ణయించి చెప్పుట.

**చతుర్విధ పరబ్రహ్మ ప్రాప్తియందలి ప్రమాణములు :**

1. శాస్త్రము – వేదాంత శాస్త్రము శాసించునది. 2 యుక్తి – వాదముల ద్వారా దృష్టాంతములతో నిరూపించునది. 3 గురూపదేశము – శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠాగరిష్ఠుడగు గురువు ఉపదేశించునది. 4 స్వానుభవము – విశుద్ధాంతఃకరణము కలిగి స్వానుభవము ద్వారా తెలియునది.

,, **పురుషార్థములు :** 1. ధర్మము 2. అర్థము 3. కామము 4. మోక్షము.

,, **ప్రణవ పాదములు :**

| ఆత్మపాదము | సామ్యము |
|---|---|
| 1. 'అ' కారము _ విశ్వుడు. వైశ్వానరుడు జాగ్రదవస్థ, స్థూల ప్రపంచము | వ్యాప్తి మొదలగుట |
| 2. 'ఉ' కారము _ తైజసుడు, హిరణ్యగర్భుడు స్వప్నావస్థ, సూక్ష్మ ప్రపంచము | ఉత్కృష్టము ఉభయత్వము |
| 3. 'మ' కారము _ ప్రాజ్ఞుడు, అవ్యాకృతము సుషుప్త్యవస్థ, ప్రపంచద్వయ కారణము | కొలువబడుట ఏకీభావము నందుట |
| 4. అమాత్రము – తురీయావస్థ | ఉపశమము, అవ్యవహారము |

,, **ప్రళయములు :** 1. నిత్య ప్ర. – జీవ సుషుప్తి 2. నైమిత్తిక ప్ర. - చతుర్ముఖ బ్రహ్మ యొక్క (చతుర్యుగ సహస్ర పరిమితమగు) దివావసానమున సంభవించునది. 3. ప్రాకృత ప్ర. – కల్పానంతరము(బ్రహ్మయొక్క ఆయుష్కాలము ముగిసినప్పుడు)

జరుగునది 4. ఆత్యంతిక ప్ర - సర్వజీవులును క్రమముగా ముక్తినందునపుడు కలిగెడిది. (తరువాత సృష్టి యుండదు)

**చతుర్విధ ప్రీతులు** : 1. అభిమాన ప్రీతి 2. విభవ ప్రీతి 3. సదృశ ప్రీతి విషయ ప్రీతి.

,, **బుద్ధి గుణములు** : 1 సంశయము 2. నిశ్చయము 3. గర్వము 4 స్మరణము.

,, **బ్రహ్మచర్య వ్రత లక్షణములు** : 1. గురు శుశ్రూష 2. భిక్షాన్న గ్రహణము 3. మైథున వర్జనము 4. శాస్త్ర పఠనము

,, **బ్రహ్మచారులు** : 1. గాయత్రి బ్ర. 2. ప్రాజాపత్య బ్ర, 3 వైదిక బ్ర. 4. నైష్ఠిక బ్ర

,, **భక్తులు** : 1 ఆర్తుడు - ఆధ్యాత్మికాది దుఃఖములచే పీడితుడై పరమాత్మను భజించువాడు ఉదా : ద్రౌపది, గజేంద్రుడు. 2, అర్థార్థి — సంపదను కోరి పరమాత్మను భజించువాడు. ఉదా : ధృవుడు. 3. జిజ్ఞాసువు — మోక్ష విషయికమగు అపేక్షచే పరతత్త్వమును విచారించువాడు. ఉదా : ఉద్ధవుడు, అక్రూరుడు. 4. జ్ఞాని – పరమాత్మయే తానను అభేద దృష్టితో నుండువాడు. ఉదా : శుకుడు

,, **భగవదర్పణములు** : ఏ రకమునైనా 1. చేసిన పని 2. తినిన ఆహారము 3. ఇతరుల కిచ్చిన దానము 4. చేసిన తపస్సు భగవదర్పణము చేయుట.

,, **భావనలు** (ముముక్షువునకు అంతఃకరణ శుద్ధిని కలుగజేయునది) : 1. మైత్రి — సుఖవంతుల యందుగల స్నేహము. 2. కరుణ — దుఃఖితుల యందుగల దయ. 3. ముదిత — పుణ్యాత్ముల యందు గల సంతోషము. 4. ఉపేక్ష—పాపులయందుగల ఉదాసీనత్వము.

,, **భూమికలు** (జీవన్ముక్త జ్ఞానులకు గలవి) : 1. బ్రహ్మవేత్తలు — ధీమంతులు, ప్రశాంత మనస్కులు వర్ణాశ్రమాది కార్యములను

నిర్వహింతురు కాని, అవి పరకార్యములవలె చేయుదురు, అసంగులు. 2. బ్రహ్మ విద్వరులు – నిత్యము సమాధి నిష్ఠులై, తమ దేహస్థితి కొరకు ఆహారాదులకై తమంతట తామే సమాధి నుండి మేల్కొనుదురు. 3. బ్రహ్మ విద్వరీయులు – నిత్యము సమాధిలో నుండి, దేహ రక్షణ నిమిత్తమై ఇతరులచేత మేల్కొలుపబడుదురు. 4. బ్రహ్మ విద్వరిష్ఠులు – నిత్యము సమాధిలో నుండి, తమంతటగాని ఇతరుల వలనగాని దేహస్ఫూర్తి కలుగని వారు.

**చతుర్విధ మంత్ర భేదములు :** 1. స్తుతము 2 స్తోమము 3 గ్రహము 4. స్తోభము.

,, **మంత్ర యోగములు :** 1. అజప యో. 2. జప యో. 3. క్రియా యో 4. స్మరణ యో.

,, **మహా వాక్యములు :** 1. ప్రజ్ఞానం బ్రహ్మ – సంపూర్ణ జ్ఞానము పరబ్రహ్మము – లక్షణ వాక్యము. (ఋగ్వేదములోని ఐతరేయ ఉపనిషత్తులోనిది) 2. తత్త్వమసి – ఆ పరమాత్మయే నీవు అయి ఉన్నావు – ఉపదేశ వాక్యము. (సామవేదములోని ఛాందోగ్యోపనిషత్తులోనిది) 3. అయమాత్మా బ్రహ్మ – ఈ ఆత్మయే బ్రహ్మము – సాక్షాత్కార వాక్యము (అథర్వణ వేదములోని మాండూక్యోపనిషత్తు లోనిది) 4. అహం బ్రహ్మాస్మి – నేను బ్రహ్మము అయి ఉన్నాను – అనుభవ వాక్యము (యజుర్వేదములోని బృహదారణ్యకోపనిషత్తు లోనిది)

,, **మానవులు :** 1. పామరుడు – విహిత నిషిద్ధ భోగములలో ఆసక్తుడై శాస్త్ర సంస్కారములు లేని మూఢుడు. 2. విషయి – ఇహపర లోకముల యొక్క విషయ భోగముల కొరకు శాస్త్రానుసారముగా విధ్యుక్త కర్మలను ఆచరించువాడు. 3. జిజ్ఞాసువు – సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించినవాడు. 4. ముక్తుడు - దేహత్రయ విలక్షణము, పంచకోశ వ్యతిరిక్తము, అవస్థాత్రయ సాక్షి అయిన తన స్వరూపమే పరబ్రహ్మయను అపరోక్ష జ్ఞానము కలవాడు.

చతుర్ మాస్యలు : 1. ఆషాఢము 2. శ్రావణము 3. భాద్రపదము 4. ఆశ్వయుజము

చతుర్విధ మాస్యహవిర్యజ్ఞములు : 1. వైశ్వదేవము 2. వరుణప్రఘాసము 3. పాపమేధము 4. సునాశీరము. (చాతుర్మాస్యహవిర్యజ్ఞములు)

చతుర్విధ ముక్తులు : 1. సాలోక్యము - భగవంతునితో ఏకప్రపంచములో నివసించుట. 2. సామీప్యము - భగవంతునితో ముఖాముఖీగా నున్నట్లుండుట. 3. సారూప్యము - భగవంతుని భావించిన రూపము పొందినట్లుండుట. 4. సాయుజ్యము - భేదభావము నశించి భగవంతునితో ఐక్యము పొందుట.

,, యజ్ఞములు : 1. విధి య. - వేదములు విధించు యజ్ఞ కర్మలు. 2. జప య. - ఇతరులకు వినబడునట్లొనర్చు మంత్రోచ్చారణము. 3. ఉపాంశు య. - కేవలము స్వశ్రవణగోచరమగు మంత్రోచ్చారణము. 4. మానస య. - జ్ఞానయజ్ఞము. మానసికముగా చేయు మంత్రోచ్చారణము.

చతుర్ యుగములు : 1. కృతయు. 2. త్రేతాయు. 3. ద్వాపరయు. 4. కలియు.

చతుర్విధ యోగములు : 1. మంత్ర యో. - మంత్రోపాసన ద్వారా వివిధ సిద్ధులను సాధించునది. 2. లయ యో. - మనస్సును ఆత్మవస్తువునందుగాని, మరొక ధ్యేయ వస్తువునందుగాని లయింపజేయునది. 3. హఠ యో. - వివిధ ఆసనములు మొదలైన శరీరప్రక్రియల మూలముగా దేహమును రోగ, జరా, మరణ వర్జితము చేయునది. 4. రాజ యో. - చిత్త వృత్తుల నిరోధము ప్రధానముగా నుండునది.

,, రజోగుణ లక్షణములు : 1. లోభము - ధనము మీద నుండు అధిక ఆశ 2. ప్రవృత్తి - ఎప్పటికిని ఏదోయొక పనిలో నిమగ్నుడై యుండుట. 3. కర్మారంభము - సకామ బుద్ధితో పనులను ఆరంభించుట. 4. అశమము - అశాంతి.

చతుర్విధ వర్ణములు : 1. బ్రాహ్మణులు - తమ సాత్త్విక గుణముల మూలముగా బ్రహ్మతత్త్వమును అన్వేషించుచు ప్రపంచములో ఆధ్యాత్మిక, నైతిక, ప్రగతిశీల జీవితమును ప్రేరేపించువారు. 2. క్షత్రియులు- శాసన వ్యవస్థను చేపట్టి ప్రభుమంత్రోత్సాహ శక్తుల సహాయముతో ధర్మమును రక్షించుచు దుష్టులను అదిమి దీన దుర్బలులను పోషించువారు. 3. వైశ్యులు - న్యాయబద్ధమైన తమ వృత్తి వ్యాపారములతో పాడిపంటలను వృద్ధిపరచువారు. 4. శూద్రులు - సేవా ధర్మమును ఆశ్రయించి ప్రపంచ శ్రేయస్సుకు పునాదులు వేయువారు.

,, వస్తు నిర్ణయ లక్షణములు : 1. జాతి 2. గుణము 3. క్రియ 4. 4. సంబంధము.

,, వాక్ రూపములు : 1. పరా వా. - స్ఫురణ రూపమైన జ్ఞానము. ప్రాణమునందు రూపు దాల్చును. 2. పశ్యన్తీ వా. - జ్ఞానమునకు తరువాత కలుగు సంకల్ప రూపమైనది. మనస్సునందు రూపు దాల్చును. 3. మధ్యమ వా. - ధ్వన్యాత్మకమైన హృదయగత భావనలను తెలుపునది. ఇంద్రియములందు రూపుదాల్చును. 4. వైఖరీ వా. - వర్ణాత్మకమైన హృదయగత భావములను తెలుపునది. వాక్ ప్రకటనయందు రూపుదాల్చును.

,, వాన ప్రస్థులు : 1. ఔదంబరుడు 2. ఫేనసుడు 3. సంప్రక్షాళి 4. పౌర్ణముడు.

,, విజ్ఞానోదయమునకు కృపలు : 1. దైవకృప 2. గురుకృప 3. వేదముల కృప 4. అంతఃకరణము యొక్క విశుద్ధకృప.

చతుర్ విదిక్కులు : 1. ఆగ్నేయము 2. నైఋత్యము 3. వాయవ్యము 4. ఈశాన్యము.

చతుర్విధ విద్యలు (విద్యా చతుష్టయము) : 1. ఆన్వీక్షకీ విద్య - ఆత్మ అనాత్మల వివేకము ద్వారా మోక్షసాధనమైన విద్య. 2. త్రయీ విద్య - కర్మఫలము వలన స్వర్గసాధనమగు విద్య 3. వార్తావిద్య. -

కృషి మొదలైనవాని ఫలరూపమైన జీవన విద్య. ౪. దండనీతివిద్య - ప్రభుత్వముచే ధన ధాన్య సంపాదనకు సాధనమగు విద్య.

చతుర్ వేద భాగములు : 1 సంహిత - మంత్రభాగము 2. బ్రాహ్మణములు - మంత్రభాగములను వివరించునవి 3. అరణ్యకములు - ఉపాసనలను గూర్చి చెప్పునవి 4. ఉపనిషత్తులు - వేదములకు తుదిలో గల భాగములు.

,, వేదములు : 1. ఋగ్వేదము - ఋక్కులను మంత్రములు కలిగి యజ్ఞ నిర్వహణలో దేవతలను స్తుతించుటకు ఉపయోగింపబడునవి. 2. యజుర్వేదము - యజుస్సులను మంత్రములద్వారా యజ్ఞయాగాదుల క్రియా కలాపములు వివరించునవి. 3. సామవేదము - సామలను మంత్రములు కలిగి రాగబద్ధముగా గానముచేయుట వివరించునవి. 4. అధర్వణ వేదము - సుఖముగా బ్రతుకుటకు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక విషయములు మంత్రముల ద్వారా వివరించునవి.

చతుర్విధ వేదవ్రతములు : (i) యజుర్వేద సాంప్రదాయాను సారము - 1. ప్రాజాపత్యము 2. సౌమ్యము 3. ఆగ్నేయము 4. వైశ్వదేవము- (ii) ఋగ్వేద సంప్రదాయాను సారము - 1. మహానామ్ని 2. మహా 3. టపనిషత్ 4. గోదాన వ్రతములు. (iii) సామవేద సంప్రదాయాను సారము - 1. గోదాన వ్ర. 2. వ్రాతిక వ్ర. 3. ఆదిత్య వ్ర. 4. మహాన్నామి వ్ర.

,, వేదాంత శాస్త్ర వాదములు : 1. అభాస వా. - మాయకు అధిష్ఠానమై మాయయందు శుద్ధచైతన్యాభాసముజీవుడు 2. బింబ ప్రతిబింబ వా. - మాయలో పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము ఈశ్వరుడు. అవిద్యలో పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము జీవుడు. 3. అవచ్ఛేద వా. - మాయా విశిష్ట చైతన్యము ఈశ్వరుడు. అవిద్యా విశిష్ట చైతన్యము జీవుడు 4. అనిర్వచనీయ వా. - మాయ అనిర్వ

చనీయము. మాయచేతనే జీవుడు, ఈశ్వరుడు, జగత్తు మొదలైనవి కల్పితములు.

చతుర్విధ శాస్త్రములు : 1. వ్యాకరణము 2. తర్కము 3. మీమాంస 4. ధర్మము.

,, సన్యాసములు : 1. కుటీచక స. - తీర్థయాత్రలు సేవింప లేనప్పుడు వైరాగ్యవంతుడు ఒకచోట మఠము లేక ఆశ్రమము నిర్మించుకొని యుండుట 2. బహూదక స. - తీర్థయాత్రలు చేయుచుండుట 3. హంస స. - పై రెండింటి కంటె తీవ్రతర వైరాగ్యము పొంది, కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతపరుడై దినమున కొకసారి భుజించుచు యుండుట. 4. పరమహంస స. - పరావైరాగ్యము కలిగి సర్వ కర్మ వివర్జితుడై ఆత్మనిష్ఠుడై యుండుట.

,, సన్యాసులు : 1. వైరాగ్య స.- పూర్వజన్మ పరిపాకముచేత అత్యంత వైరాగ్యము కలిగి సన్యసించినవారు. 2. జ్ఞాన స - శాస్త్ర జ్ఞానము వలన విరక్తి కలిగి సాధన చతుష్టయ సంపన్నులై సన్యసించిన వారు. 3. జ్ఞాన వైరాగ్య స. - సాధన చతుష్టయ మభ్యసించి ఆత్మానుసంధాన పరులై వైరాగ్యము కలిగి సన్యసించినవారు. 4. కర్మ స. - బ్రహ్మ చర్యాది మూడు ఆశ్రమములను క్రమముగా జరిపి సన్యసించినవారు.

,, సృష్టి వర్గములు : 1. అండజములు - గ్రుడ్లలో నుండి వచ్చునవి 2. స్వేదజములు - చెమటలో నుండి వచ్చునవి. 3. ఉద్భిజ్జములు - భూమిని పెల్లగించుకొని వచ్చునవి. 4. జరాజములు - తల్లి గర్భమున కొంత కాలముండి మావిలో వెలువడునవి.

,, స్పర్శలు : 1. మృదు స్ప. 2. కఠిన స్ప. 3. ఉష్ణ స్ప. 4. శీతల స్ప.

,, సాధనలు : (సాధన చతుష్టయము) 1. నిత్యానిత్య వస్తు వివేకము బ్రహ్మము ఒక్కటే నిత్యము (శాశ్వతము) తక్కినదంతయు నశించునది యని తెలియుట, 2. ఇహాముత్ర ఫల భోగ విరాగము - ఈ

లోకములోని, స్వర్గాదులలోని సుఖములందు కోరిక లేక యుండుట, 3. శమాది షట్కసంపత్తి - శమము, దమము, ఉపరమము, తితిక్ష, శ్రద్ధ, సమాధానము అను ఆరు గుణములు కలిగియుండుట. 4. ముముక్షుత్వము. ముక్తిని పొందవలెనను కోరిక కలిగియుండుట.

## 5. పంచ

పంచ అంగములు : (i) (పంచాంగము) 1 తిథి 2. వారము 3. నక్షత్రము 4. యోగము 5. కరణము. (ii) 1. ఉపాయము 2. సహాయము 3. దేశకాల విభజనము 4. ఆపదకు ప్రతిక్రియ 5. కార్యసిద్ధి (iii) 1. కరములు 2. చరణములు 3. ఉరము 4. లలాటము 5. భుజములు.

,, అంగుళులు : 1. అంగుష్ఠము 2. తర్జని 3. మధ్యమ 4. అనామిక 5. కనిష్ఠిక.

పంచవిధ అంశములు : 1. సత్తు 2. చిత్తు 3. ఆనందము 4. రూపము 5. నామము.

పంచ అగ్నిభాగములు : (జీవుని స్థూల శరీరము లోనివి) - 1. నిద్ర 2. దప్పిక 3. ఆకలి 4. కాంతి 5 ఆలస్యము.

,, అగ్నులు : (i) 1. జ్ఞానాగ్ని 2. కాలాగ్ని 3. క్షుదాగ్ని 4. శతాగ్ని 5. కోపాగ్ని (ii) 1. ద్యులోకము 2. మేఘము 3. భూమి 4. పురుషుడు 5. స్త్రీ (iii) 1. గార్హపత్యము 2. దక్షిణాగ్ని 3. పశ్చిమాగ్ని 4. ఉత్తరాగ్ని 5. సూర్యుడు. (iv) 1. పూర్వాగ్ని 2. దక్షిణాగ్ని 3. పశ్చిమాగ్ని 4. ఉత్తరాగ్ని 5. సూర్యుడు. (v) 1. జఠరాగ్ని 2. బడబాగ్ని 3 గృహాగ్ని 4. దావాగ్ని 5. వైదికాగ్ని (vi) 1. అంతర్గతాగ్ని 2. తేజస్సు 3. క్రోధము 4. చక్షువు 5. ఊష్మము.

పంచవిధ అనాశిష్ట ఛందస్సులు (వేదములలోనివి) : 1. ఉక్త 2. అత్యుక్త 3. మధ్య 4. ప్రతిష్ఠ 5. సుప్రతిష్ఠ.

పంచవిధ అనుమానములు : 1. నామము 2. జాతి 3. గుణము 4. దృశ్యము 5. క్రియ.

,, అపరాధములు : 1. అకృత్యకరణము - చేయకూడని పనులు చేయుట. 2. కృత్యాకరణము - చేయవలసిన పనులు మానివేయుట. 3. అభక్ష్య భక్షణము - తినకూడని పదార్థములను తినుట 4. అపేయపానము - త్రాగకూడని పానీయములు త్రాగుట. 5. అగమ్యాగమనము - పొంద దగని స్త్రీలను పొందుట.

,, అబ్దములు : 1. సాయన 2. సౌర 3. చాంద్ర 4. నక్షత్ర 5. బార్హస్పత్యములు.

,, అభావములు : 1. ప్రాగభావము. - (జ్ఞానము) కార్యోత్పత్తికి ముందుండునది. 2. ప్రధ్వంస అ. - నాశానంతరము ఉండునది. 3. అన్యోన్య అ. - పరస్పరమునందుండునది. 4. అత్యన్త అ. - త్రికాలములందును లేనిది. 5. సామయిక అ. - ఒకకాలమునందుండునది, మరియొక కాలమందు లేనిది.

పంచ అమృతములు : 1. ఉదకము 2. పాలు 3. పెరుగు 4. నేయి 5. తేనె.

,, అవయవ వాక్యములు : (i) ప్రతిజ్ఞ 2. హేతువు 3. ఉదాహరణము 4. ఉపనయనము 5. నిగమనము (ii) 1. సంశయము 2. జిజ్ఞాస 3. శక్యప్రాప్తి 4. ప్రయోజనము 5. సంశయవ్యుదాసము.

పంచవిధ అశౌచములు : 1. జాత అ. 2. మృత అ. 3. రజస్ అ. 4. ఉచ్ఛిష్ట అ. 5. జాతి అ.

పంచ అక్షరి : (i) (ఓం) నమఃశివాయ (ii) అ-ఉ-మ, నాదము, బిందువు (ఓంకారపంచాక్షరి).

పంచవిధ ఆకాశ తత్త్వములు : 1. జ్ఞానము 2. మనస్సు 3. బుద్ధి 4. చిత్తము 5. అహంకారము.

పంచ విధ ఆకాశ భావములు : (జీవుని స్థూల శరీరములోనివి) - 1. శోకము 2. కామము 3. క్రోధము 4. మోహము 5. భయము.

,, ఆకాశములు : (i) 1. జ్ఞానము 2. సమానము 3. శ్రోత్రము 4. శబ్దము 5. వాక్కు (ii) 1. పరాకాశము 2. చిత్త ఆ. 3. మహా ఆ. 4. తత్త్వ ఆ. 5. సూర్య ఆ.

,, ఆచారములు : (i) 1. లింగ ఆ. 2. సత్ ఆ. 3. శివ ఆ. 4. గణ ఆ. 5. భృత్య ఆ. (ii) 1. దర్శన ఆ. 2. చారిత్ర ఆ. 3. జ్ఞాన ఆ. 4. తాపస ఆ. 5. వీర్య ఆ.

,, ఆసనములు : 1. పద్మ ఆ. 2. స్వస్తిక ఆ. 3. వజ్ర ఆ. 4. భద్ర ఆ. 5. వీర ఆ.

,, ఆహార లక్షణములు : (ఆధ్యాత్మ సాధకుని) 1. యజ్ఞశేషము (న్యాయార్జితము) 2. సాత్త్వికము 3. పరిమితము 4. రుచికొరకు కాక ఆకలికొరకు తినుట 5. భగవన్నివేదితము.

,, ఉదక భాగములు : (జీవుని స్థూల శరీరములోనివి) 1. శుక్లము 2. రక్తము 3. లాలాజలము 4. మూత్రము 5. స్వేదము.

,, ఉదకములు : 1. చిత్తము 2. ప్రాణము 3. జిహ్వ 4. రసము 5. గుహ్యము.

పంచ ఉపచారములు : (i) 1. స్నానము 2. పూజ 3. నైవేద్యము 4. ప్రదక్షిణము 5. నమస్కారము (ii) 1. గంధము 2. పుష్పము 3. ధూపము 4. దీపము 5. నైవేద్యము.

పంచవిధ ఉపాయములు : (చిత్తతన్మయతకు) 1. కామము 2. ద్వేషము 3. భయము 4. స్నేహము 5. భక్తి

పంచ ప్రాణములు : 1. నాగము - వాగుచ్చారణహేతువైన వాయువు వాగ్ద్వారమునందుండును 2. కూర్మము - నిమేషోన్మేషహేతువైనవాయువు. కంటి రెప్పలయందుండును. 3. కృకరము - తుమ్మునకు హేతు

వైన వాయువు నాసికయందుండును. 4. దేవదత్తము - జృంభా (ఆవులింతలకు) హేతువైన వాయువు. కంఠద్వారమునందుండును. 5. ధనంజయము - మృత శరీర పుష్టిహేతువైన వాయువు. సర్వ శరీరమునందుండును.

పంచవిధ కర్మ ఫలములు : 1. పదార్థ ఉత్పత్తి 2. పదార్థ నాశము 3. పదార్థ ప్రాప్తి 4. పదార్థ పరిణామము 5, పదార్థ సంస్కారము.

,, కర్మములు : (i) 1. నిషిద్ధ క. - చేయకూడనివి. 2. కామ్య క. ఫలాపేక్షతో చేయునవి. 3. నిత్య క. - ప్రతి నిత్యము చేయ వలసినవి. 4. నైమిత్తిక క. - నిమిత్తము (కారణము) ననుసరించి ఆయా సమయములలో చేయునది. 5. ప్రాయశ్చిత్త క. పాపకర్మల నివృత్తికి చేయునవి. (ii) 1. ఉత్క్షేపణము - పైకిఎత్తుట 2. అవక్షేపణము - క్రిందికి దించుట. 3. అకుంచనము - ముడుచుట 4. గమనము - నడచుట 5. ప్రసారణము - చూచుట.

పంచ కర్మేంద్రియములు : (i) జీవునివి - 1. వాక్కు-నోరు 2. పాణి-చేతులు 3. పాదము - కాళ్ళు 4. పాయువు - మలవిసర్జన అంగము 5. ఉపస్థ - జననేంద్రియము (ii) ఈశ్వరునివి - 1. అగ్ని 2. ఇంద్రుడు 3. విష్ణువు 4. బ్రహ్మ 5. మృత్యువు.

,, కర్మేంద్రియ తత్త్వ విషయములు : 1. వచనము - వాక్కునకు 2. దానము - పాణికి 3. గమనము - పాదమునకు 4. ఆనందము - ఉపస్థకు 5. మలవిసర్జనము - పాయువునకు.

పంచవిధ కారణములు : (i) 1. కాల కా. 2. స్వభావ కా. 3. పురుష కా. 4. కర్మ కా. 5. నియత కా. (ii) కర్మాచరణమునకు - 1. శరీరము - కర్మాచరణకు ఆధారమైనది 2. జీవుడు - కర్తృత్వాభిమానమున అహంకరించువాడు 3. ఇంద్రియములు - బాహ్యము, అంతరము 4. వివిధ వ్యాపారములు - ఇంద్రియములకు బాహ్య పరికరములకు సంబంధమువలన ఏర్పడినవి. 5. దైవము లేక విధి - ప్రారబ్ధము.

పంచవిధ కాలములు : 1. ప్రాతః కా. 2. సంగమ కా. 3. మధ్యాహ్న కా. 4. అపరాహ్ణ కా. 5. సాయం కా.

పంచ కోశములు : 1. అన్నమయ కో. - స్థూల శరీరము 2. ప్రాణమయ కో. పంచ కర్మేంద్రియములు పంచప్రాణములు కలిసినది. 3. మనో మయ కో. - జ్ఞానేంద్రియ పంచకముతో కూడిన మనస్సు. 4. విజ్ఞాన మయ కో. - జ్ఞానేంద్రియ పంచకముతో కూడిన బుద్ధి. 5. ఆనంద మయ కో. - కారణ శరీరము.

పంచ విధ క్రియలు : 1. ఉక్తి - వాక్ 2. ఆదానము - పాణి 3. గమనము - పాద 4. విసర్గము - వాయువు 5. ఆనందకము - ఉపస్థ.

పంచ క్లేశములు : (క్లేశ పంచకము) 1. అవిద్య క్లే. - తాను జీవుడని నిర్ణయించుట, 2. అబినవ క్లే. - సంసార కారణమగు మోహతాదాత్మ్యమును వదలకుండుట. 3. అస్మిత క్లే. - విషయాభిలాష కలిగి విర్రవీగు చుండుట. 4. రాగ క్లే. - అర్థములయందు అధిక అనురక్తి కలిగి యుండుట. 5. ద్వేష క్లే. - పరులచేత అబిమతము ఈడేరకుండిన వారిని దూషించుట

,, గవ్యములు : 1. గోమూత్రము - వరుణుడు 2. గోమయము - అగ్ని 3. గోఘృతము - సూర్యుడు 4 గోదధి - వాయువు 5. గోక్షీరము - చంద్రుడు (దేవతలు పైన చెప్పబడిన వాటిలో ఉన్నందు వలన పంచగవ్యములు సర్వదేవతామయ మనబడును).

పంచ విధ చరములు : 1. ఖేచరులు - దేవతలు, పక్షులు 2. భూచరులు - మనుష్యాదులు 3. వనచరులు - మృగాదులు 4. జలచరులు - మత్స్యాదులు 5. ధీచరులు - దేవతలు, జ్ఞానులు.

,, చిత్త అవస్థలు : 1. క్షిప్తము - రజోగుణమున రాగద్వేషాదులకు వశమై చిత్తము విషయ పదార్థములలో అధికముగా లగ్నమగుట. 2. మూఢము - తమోగుణమున నిద్రతో, బద్ధకముతో, కునికి పాట్లతో కూడినది. 3. విక్షిప్తము - విషయాసక్తమై యున్నను సత్వగుణమున

అప్పుడప్పుడు ధ్యాననిమగ్నస్థితిని పొందియుండగలుగునది. 4. ఏకాగ్రము - సత్త్వాతిశయమున అవిచ్ఛిన్నతైలధారవలె ఒకేధ్యేయ వస్తువును విషయీకరించు శక్తి. 5. నిరుద్ధము - ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను త్రిపుటి పరిజ్ఞానము లేక నిరుద్ధమైన (కదలని) చిత్తావస్థ.

పంచవిధ చైతన్యములు : 1. శుద్ధ చైతన్యము - పరమాత్మ 2. మాయావచ్ఛిన్న చై. - ఈశ్వరుడు 3. అంతఃకరణావచ్ఛిన్న చై. - జీవుడు 4. మృత్యువుచే అవచ్ఛిన్న చై. - మహదహంకారము 5. విషయావచ్ఛిన్న చై. - జ్ఞానశూన్యము.

,, జాతులు : (i) మానవ - 1. బ్రాహ్మణులు 2. క్షత్రియులు 3. వైశ్యులు 4. శూద్రులు 5. నిషాదులు. (ii) దేవ - 1. దేవతలు 2. మానవులు 3. నాగులు 4. గంధర్వులు 5. పితరులు.

,, జీవ కృత్యములు : 1. జాగ్రత్ 2. స్వప్నము 3. సుషుప్తి 4. తురీయము 5. తురీయాతీతము.

,, జీవన్ముక్తి ప్రయోజనములు : 1. జ్ఞాన రక్షణము 2. తపస్సు 3. విసంవాదాభావము 4. దుఃఖనాశము 5. సుఖావిర్భావము.

,, జ్ఞానములు : 1. ఇంద్రియార్థ జ్ఞా. 2. నైతిక జ్ఞా. 3. ఈశ్వర జ్ఞా. 4. బ్రహ్మ జ్ఞా. 5. శుద్ధ జ్ఞా.

పంచ జ్ఞానేంద్రియములు : (i) జీవునివి - 1. శ్రోత్రము (చెవి) 2. త్వక్కు (చర్మము) 3. నేత్రము 4. జిహ్వ (నాలుక) 5. ఘ్రాణము (వాసన). (ii) ఈశ్వరునివి - 1. దిక్కులు 2. వాయువు 3. సూర్యుడు 4. వరుణుడు 5. అశ్వినీదేవతలు.

,, తంత్రములు : (i) 1. మిత్రలాభము 2. మిత్రభేదము 3. సంధి విగ్రహము 4. లబ్ధ నాశము 5. అసంప్రేక్ష్య కారిత్వము. (ii) 1. భేదము 2. పరీక్ష 3. విశ్వాసము 4 వంచనము 5. మిత్ర కార్యము.

పంచ తన్మాత్రలు : 1. శబ్దము 2. స్పర్శము 3. రూపము 4. రసము 5. గంధము.

,, తీర్థములు : (i) 1. అమృత 2. తప్త 3. రామ 4. సీతా 5. సూర్య కుండములు. (ii) 1. సౌభద్ర 2. పౌలోమ 3. భారద్వాజ 4. కారంధమ 5. ప్రసన్నములు.

,, దుర్గలు : 1. సతి 2. రాధ 3. లక్ష్మి 4. సరస్వతి 5. గాయత్రి

పంచవిధ దుర్లభులు : (ఆత్మ విషయమున) 1. శ్రవణము చేయువాడు 2. మననము చేయువాడు 3. చెప్పువాడు 4. పొందువాడు 5. తెలియువాడు.

,, దేవతరులు : 1. మందారము 2. కల్పవృక్షము 3. పారిజాతము 4. సంతానము 5. హరి చందనము.

,, దేహములు : 1. స్థూల దే. 2. సూక్ష్మ దే. 3. కారణ దే. 4. మనఃకారణ దే. 5. కైవల్య జ్ఞాన దే.

,, దైవతములు : 1. బ్రహ్మ 2 విష్ణువు 3 మహేశ్వరుడు 4. రుద్రుడు 5. సదాశివుడు.

,, ధర్మములు : 1. జాతి ధ. 2 ఆశ్రమ ధ. 3. మత ధ. 4. దేశ ధ. 5. గుణ ధ.

,, ధాతువులు : 1. బంగారము 2 వెండి 3. రాగి 4. కంచు 5. ఇనుము.

,, నదములు : 1. వితస్త న. 2. ఇరావతి న. 3. చంద్రభాగ న. 4. శతద్రు న. 5. విపాశ న.

,, నర జీవనములు : 1. నీతిశూన్య జీ. 2. కేవల నైతిక జీ. 3. సేశ్వర నైతిక జీ. 4. సాధన భక్తి జీ. 5. భావభక్తి జీ.

,, నాటక సంధులు : 1. ముఖము 2. ప్రతిముఖము 3. గర్భము 4. అవమర్శము 5 నిర్వహణము.

పంచ నియమ అంగములు : 1. శౌచము - శారీరక మానసిక పరిశుద్ధత. 2. సంతోషము - తృప్తి 3. తపము - స్వయంరక్షణము 4. స్వాధ్యాయము - పవిత్ర గ్రంథముల అధ్యయనము. 5. ఈశ్వర ప్రణిధానము - దేవుని యందు భక్తి.

పంచవిధ నీరాజనములు : 1. దీపము 2 పద్మము 3. వస్త్రము 4. చూత ఫలము 5. తమలపాకు.

,, పరబ్రహ్మ లక్షణములు : 1. సర్వవ్యాపకత్వము - బ్రహ్మాది స్థావరాంతమువరకు అన్నిటియందు వ్యాపించినది. 2. సర్వాధిష్ఠానత్వము - సర్వ జగత్తునకు అధిష్ఠానమైనది. 3. నిరుపాధికత్వము- ఉపాధిలేనిది. 4. అపరిచ్ఛిన్నత్వము - దేశకాలాదులచే పరిచ్ఛిన్నము కానిది. 5. పరిపూర్ణత్వము - అమృతమయము, శోకరహితము, పరమానందము అయినది.

,, పరమేశ్వర కృత్యములు : 1. సృష్టి - పుట్టించుట 2. స్థితి - పెరిగి పెద్ద యగునట్లు చేయుట. 3. లయము - నశింపజేయుట 4. అనుగ్రహము - పరమేశ్వరుని సమీపించు మార్గమును చూపుట. 5. తిరోధానము - పరమేశ్వరునకు దూరమగునట్లు నడుపుట.

,, పాశములు : (i) 1. మల పా. 2. మాయా పా. 3. కర్మ పా. 4. బిందు పా. 5. తిరోధాన పా. (ii) 1. అణవ పా. 2. కార్మికపా. 3. మాయా పా. 4. బైందవ పా. 5. నిరోధశక్తి పా.

,, పితలు : 1. జనకుడు 2. ఉపనేత - ఉపనయనము చేసినవాడు 3. కన్యాదాత లేక విద్యాదాత 4. అన్నదాత 5. అభయదాత.

,, పురాణ లక్షణములు : 1. సర్గము 2. ప్రతిసర్గము 3. వంశము 4. మన్వంతరము 5. వంశాను చరితము.

,, పూర్వ వాదములు : 1. పంచలక్షణి 2. వ్యధికరణము 3 సిద్ధాంత లక్షణము 4. అవచ్ఛేదకత్వనిరుక్తి 5. పక్షత.

పంచ ప్రణవములు : (పరమేశ్వరునివి) 1. ఓం - దాహక శక్తి 2. 2. హ్రీం- తేజశ్శక్తి 3. క్లీం - ఆకర్షణ శక్తి 4. ఐం - శబ్దశక్తి 5. సౌః - విద్యుచ్ఛక్తి.

,, ప్రాణములు : (i) జీవునివి - 1. ప్రాణము-హృదయములో నుండి వక్త్రి, నేత్ర, శ్రోత్ర, నాసికా రంధ్రముల వరకు వ్యాపించి ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములలో తిరుగునది. 2. అపానము - పాయు, ఉపస్థ లలో నుండి మలమూత్ర విసర్జనలను చేయునది. 3. వ్యానము - సర్వనాడులలోను సంచరించుచు రక్తాదులను శరీరమంతట వ్యాపింప జేయునది. 4. ఉదానము - కంఠములోనుండి ఊర్ధ్వగమనముకలిగి అవసానకాలములో జీవుల పుణ్యపాప కర్మానుసారము ఉత్క్రమణము చేయునది. 5. సమానము - నాభిస్థానములో నుండి అన్నపానము లను రక్తముగా పరిణమింప జేయునది. (ii) ఈశ్వరునివి - అధి దేవతలు - 1. జయుడు - సమాన ప్రాణమునకు అధిదేవత 2. విశ్వయోని - వ్యానమునకు అధిదేవత. 3. అజుడు - ఉదానమునకు అధిదేవత 4. విశిష్టుడు - ప్రాణమునకు అధిదేవత. 5. విశ్వకర్త - అపానమునకు అధిదేవత.

పంచవిధ ప్రాప్య స్వరూపములు (జీవునివి) : 1. నిత్యులు 2. ముక్తులు 3. కేవలులు 4. ముముక్షువులు 5. బద్ధులు.

,, బద్ధ జీవులు : 1. పూర్ణ వికసిత 2. వికసిత 3. ముకుళిత 4. సంకోచిత 5. ఆచ్ఛాదిత చేతనములు.

,, బాధలు : (i) 1. అగ్ని 2. జల 3. వ్యాధి 4. దుర్భిక్ష 5. మరణ బాధలు. (ii) 1. ఆయుధము 2. చోరులు 3. శత్రువు 4. రాజశ్యాలకుడు 5. రాజలోభము.

,, బ్రహ్మ మంత్రములు : 1. సద్యోజాతము 2. వామదేవము 3. అఘోరము 4. తత్పురుషము 5. ఈశానము.

పంచ బ్రహ్మలు : 1. బ్రహ్మ 2. విష్ణువు 3. రుద్రుడు 4. ఈశ్వరుడు 5. సదాశివుడు.

పంచవిధ భక్తియోగ సాధకులు : 1. మత్పరకర్ముడు - అన్ని కర్మలు నా (భగవంతుని) పరముగా చేయువాడు. 2. మత్పరముడు - నాకు (భగవంతునికి) పరమ స్థానము నిచ్చువాడు. 3. మద్భక్తుడు - నా (భగవంతుని) భక్తుడు. 4. సంగవర్జితుడు - సంగదోషము లేనివాడు 5. సర్వభూతేషు నిర్వైరుడు - సమస్త భూతములందు వైరబుద్ధి లేనివాడు.

,, భక్ష్యములు (పంచ భక్ష్యములు) : 1. భక్ష్యము 2. భోజ్యము 3. లేహ్యము 4. చోష్యము (చ. ఆహారములందు చెప్పబడినవి) 5. పానీయము - త్రాగునది.

పంచ భూతములు (అపంచీకృత సూక్ష్మమైనవి) : 1. పృథివి 2. జలము 3. తేజము 4. వాయువు 5. ఆకాశము. (ఇతర భూతముల మిశ్రమము లేనివి).

,, భ్రాంతులు (భ్రమలు) : 1. భేద భ్రాంతి - జీవుడు ఈశ్వరుడు వేరు వేరని తోచుట. 2. కర్తృత్వ భోక్తృత్వ భ్రాం. - ఆత్మయే నిజమైన కర్తయని భోక్తయని తోచుట. 3. సంగ భ్రాం - జీవుడు తన శరీర త్రయముతో సంబంధించిన వాడని తోచుట. 4. వికార భ్రాం. - జగత్తునకు కారణమైన రూపమునకు వికారత్వము (మార్పు) ఉన్నదని తోచుట. 5. జగత్ సత్యత్వ భ్రాం. - జగత్తు కారణమునకు అన్యముగా నున్నదని తోచుట.

పంచవిధ మనోగతానుశీలనములు : 1. స్మృతి 2. ధ్యానము 3. శరణాపత్తి 4. దాస్యము 5. జిజ్ఞాసః

,, మలములు : 1. అణవ మ. - పరబ్రహ్మమును గూర్చి అప్పుడప్పుడు కలిగెడి జ్ఞానమును మరుగు పరచునది. 2. కార్మిక మ. - గురువు బోధించిన పదార్థమునందు బుద్ధి చొరనీయనిది. 3. మాయిక మ. - పరతత్త్వజ్ఞాన వాసనను ఎప్పుడు కలుగనీయనిది. 4. మాత్సీయమ మ. - పాప కార్యములందు మాత్రమే బుద్ధిని జొనుపునది. 5. తిరోధాన మ. - పరబ్రహ్మము అనిత్యమను బుద్ధిని కల్పించి జనన మరణ దుఃఖములను కలుగ జేయునది.

పంచ మహాపాతకములు : 1. స్వర్ణస్తేయము 2. సురాపానము 3. బ్రహ్మ హత్య 4. గురుపత్నీ గమనము 5. మహాపాతక సహవాసము.

పంచవిధ మహావాద్యములు : 1. భేరీ 2. శంఖము 3. కాహళము 4. పట హము 5. జయఘంట.

,, మాతలు : 1. రాజుభార్య 2. అన్నభార్య 3. గురుని భార్య 4. భార్యను గన్నతలి 5. తన్ను గన్నతల్లి.

,, మార్గములు (గురువు శిష్యుని వృద్ధికి తెచ్చునవి) : 1. కపి మా. - కోతి తమ తల్లిని గట్టిగా పట్టుకొని కదలకుండ నుండునట్లు, గురువు సన్నిధానమును శిష్యుడు వదలకుండ నుండుట. 2. విహంగ మా. - పక్షి గ్రుడ్లను పెట్టి వానిని రెక్కలతో కప్పుట వలన అవి పిల్లలై వృద్ధి పొందునట్లు, గురువు శిష్యుని తన సమీపములో నుంచు కొని వృద్ధికి తెచ్చుట. 3. మార్జాల మా. - పిల్లి తన కూనలను నోటితో కరచుకొని తాను పోవు స్థలములకు ఎత్తుకొని పోయి వాటిని వృద్ధికి తెచ్చునట్లు, గురువు శిష్యులను విడువక తనవెంట నుంచుకొని వృద్ధికి తెచ్చుట. 4. మీన మా. - చేప గ్రుడ్లను పెట్టి వాటిని తిరిగి చూడగా చూడగా అవి వృద్ధికి వచ్చునట్లు, గురువు శిష్యులవద్దకు అప్పు డప్పుడు వచ్చి వారు వృద్ధికి రావలెనని వీక్షించుట. 5. కూర్మ మా. తాబేలు ఎక్కడో గ్రుడ్లను పెట్టి తాను ఇంకొక చోటికి పోయి ఆ గ్రుడ్లను తలచుకొనుటవలన అవి వృద్ధి పొందునట్లు, గురువు దూర ముగానున్న శిష్యులను అప్పుడప్పుడు తలచుకొనుటవలన వారువృద్ధి చెందుట.

,, ముద్రలు : 1. భూచరీ ము. - ముక్కుకొనమీద లక్ష్యము నుంచుట 2. ఖేచరీ ము. - భ్రూమధ్యమునందు దృష్టిని నిలుపుట. 3. మధ్య మ ము. - భూచరీ ఖేచరీల మధ్య దృష్టినిలుపుట. 4. శాంభవీ ము. - రెండు చెవులను రెండు బొటన వ్రేళ్ళతోను, రెండు ముక్కులను రెండు అనామిక వ్రేళ్ళతోను, రెండు కళ్ళను రెండు మధ్యమ వ్రేళ్ళ తోను మూసి నాదములను, చిత్కళలను సందర్శించుట. 5. షణ్ముఖి ము. - రెండు బొటన వ్రేళ్ళతో చెవుల రంధ్రములను మూసికొని నాదమును వినుట.

పంచవిధ సోపానములు : 1. బోధ 2. ఉపరతి 3. వైరాగ్యము 4. దైవభక్తి 5. జ్ఞానము.

,, యజ్ఞములు : 1. బ్రహ్మ (ఋషి) య. - వేదశాస్త్రములను చదువుట 2. దేవ య. - దేవతలను పూజించుట 3. పితృ య. - పితృదేవతలకు శ్రాద్ధ తర్పణాదులు చేయుట 4. అతిథి (మనుష్య) య. - అతిథి సత్కారము చేయుట 5. భూత య. - పశుపక్ష్యాదులను యథాశక్తి పోషించుట. (ii) 1. ద్రవ్య య. - ధనము ద్వారా చేయబడు దానము మొదలైనవి. 2. తపో య. - ధర్మము కొరకు మనోవాక్కాయములను తపింప జేయుట 3. యోగ య. - చిత్త వృత్తులను నిరోధించి మనస్సును పరమాత్మనియందు లగ్నము చేయుట 4. స్వాధ్యాయ య. - మోక్ష శాస్త్రములను శ్రద్ధాభక్తులతో పఠించుట. 5. జ్ఞాన య. - జ్ఞాన శాస్త్రములను చదివి విని యుక్తి ప్రయుక్తులతో మననము చేయుట.

పంచ యమ అంగములు : 1. అహింస - ఇతరులను బాధపెట్టక పోవుట 2. సత్యము - ఎల్లప్పుడు సత్యమును పాటించుట 3. అస్తేయము - దొంగతనము చేయకుండుట 4. బ్రహ్మచర్యము - ఇంద్రియములను నిగ్రహించుట 5. అపరిగ్రహము - దానమును స్వీకరింపకుండుట.

పంచవిధ యాగములు . 1. అగ్నిహోత్రము 2. దర్శపూర్ణ మాసము 3. చాతుర్మాస్యము 4. నిరూఢ పశుబంధము 5. జ్యోతిష్టోమము.

,, యోగములు : (i) 1. మంత్ర యో. 2. స్పర్శ యో. 3. భావ యో. 4. అభావ యో. 5. మహా యో. (ii) 1. భక్తి యో. 2. కర్మ యో. 3. రాజ యో. 4. జ్ఞాన యో. 5. హఠ యో. (iii) 1. క్రియా యో. 2. మంత్ర యో. 3. హఠ యో. 4. నాద యో. 5. రాజ యో.

,, యోగ సాధకుని లక్షణములు : 1. ఏకాంతత - (లోపల బయట) ఏకాంతములోనుండుట 2. ఏకాకిత్వము - ఒక్కడే ఉండుట 3. 3. యతచిత్తాత్మత - చిత్తమును దేహమును నియమములో పెట్టుట

4. నిరాశ - ఆశకు దాసుడు కాకుండుట. 5. అపరిగ్రహము - (యోగ సాధకునకు అంతరాయము కలిగించు) అధికవస్తు సంగ్రహమును కోరకుండుట.

పంచ రుద్రములు (నమక చమకములు) : 1. అధర్వశిఖ 2. కైవల్య 3. కాలాగ్ని 4. శ్వేతాశ్వర 5. రుద్రములు.

,, లోహములు : 1. బంగారము 2. వెండి 3. ఇత్తడి 4. కంచు 5. ఇనుము.

,, వేదజ్ఞులు : 1. చతుర్వేదులు - నాలుగు వేదములు తెలిసినవారు. 2. త్రివేదులు - క్షర, అక్షర, ఉత్తమ పురుషుల తెలియువారు 3. ద్వివేదులు - శబ్దబ్రహ్మ, పరబ్రహ్మలను తెలియువారు. 4. ఏకవేదులు - ఒకే పరబ్రహ్మమును తెలియువారు. 5. అన్నచులు - ఈశ్వరుడు వేరుగా లేదని తెలియువారు.

పంచవిధ వేద వ్యాకరణ ప్రయోజనములు : 1. రక్ష - వేదములలో వర్ణలోప, ఆగమ, వికారములను తెలిసికొని వానిని రక్షించుట. 2. ఊహ - యజ్ఞయాగములలో లింగ విభక్తులను అవసరమైన చోట్ల మార్చగలుగుట. 3. ఆగమము - ప్రధానమైన వ్యాకరణము చదువుట ద్వారా విధిని గౌరవించు ఫలము కలుగుట. 4. లాఘవము - శబ్దజ్ఞానము తేలికగా కలుగు ఫలము. 5. అసందేహము - పదములకు సరియైన అర్థములను నిర్ణయించు శక్తి కలుగుట.

,, వైధభక్తి విధములు : 1. శరీరగత, 2. మనోగత, 3. ఆత్మగత, 4. ప్రకృతిగత, 5. సమాజగత అనుశీలనములు.

,, శరీరి ఆపములు : 1. శ్లేష్మము 2. పిత్తము 3. స్వేదము 4. వసా 5. శోణితము.

,, శుద్ధ జ్ఞానములు : 1. పరేశానుభవము 2. స్వానుభవము 3. స్వధర్మానుభవము 4. ఫలానుభవము 5. విరోధానుభవము.

పంచవిధ సత్తా స్ఫూర్తులు : 1. అస్తి 2. భాతి 3. ప్రియము 4. రూపము 5. నామము.

,, సమదర్శిత్వ లక్షణములు : 1. ద్వంద్వ సహనము 2. అనాసక్తి 3. విషయములలో దోష దర్శనము 4. కామ క్రోధాదుల వేగ సహనము 5. ఆత్మనిష్ఠ.

,, సమాధి అవస్థలు : 1. లయము - సాధకుని చిత్తము నిద్రావస్థను పొందుట. 2. విక్షేపము - శబ్దాది విషయములందు చిత్తము పరుగిడుట. 3. కషాయము - చిత్తమునందు తీవ్రమగు రాగద్వేషాది వాసనలు కలుగుట 4. రసాస్వాదనము - అవిద్యాకల్పిత ఆనందము వలన దుఃఖ నివృత్తి కలిగినదని తలచుట. 5. సమప్రాప్తి - (పై నాలుగు విఘ్నములు తొలగుట వలన) చిత్తము సమస్థితిని పొందుట. (బ్రహ్మ తత్త్వమును దర్శించుట).

పంచ సూక్తములు : 1. శ్రీ సూ. - శుద్ధ సత్త్వప్రధానమైన మాయయగు శ్రీదేవి స్తుతి. 2. పురుష సూ. - పురుషుడైన పరమేశ్వరుని స్తుతి. 3. భూ సూ. - విష్ణుదేవుని భార్యయైన భూదేవి స్తుతి. 4. నారాయణ సూ. - నారాయణ స్తుతి. 5. మన్యు సూ. - క్రోధాభిమాన దేవతా స్వరూపిణి స్తుతి.

,, సూత్రములు : 1. ఆపస్తంబ సూ. 2. ఆశ్వలాయన సూ. 3. కాత్యాయన సూ. 4. బోధాయన సూ. 5. వైఖానస సూ. (మహర్షులు రచించిన సూత్రములు).

,, సూనములు : 1. ఖండినీ సూ. - కత్తితో తరుగు నపుడు కలుగు జీవహింస. 2. పేషిణీ సూ. - తిరుగలితో విసురునప్పుడు కలుగు జీవహింస. 3. చుల్లీ సూ. - పొయ్యిని మండించునప్పుడు కలుగు జీవహింస. 4. ఉదకుంభీ సూ - నీళ్ళు నింపునప్పుడు కలుగు జీవహింస. 5. మార్జనీ సూ. - చీపురుతో చిమ్మునప్పుడు కలుగు జీవహింస.

పంచవిధ సేవాపరాధములు : 1. సాధ్యతమ యత్నాభావము 2. అవజ్ఞ 3. అపవిత్రత 4. గర్వము 5. నిష్ఠాభావము.

పంచవిధ స్థానములు : 1. బొడ్డు 2. గుండె 3. మెడ 4. మూర్ధము 5. ముఖము.

పంచ స్థూల శరీర పృథ్వి భాగములు : (జీవునివి) 1. రోమములు 2. చర్మము 3. నరములు 4. మాంసము 5. ఎముకలు.

,, స్థూల శరీర వాయు భాగములు : (జీవునివి) 1. చలనము (కదలుట) వలనము (యదేచ్ఛగా తిరుగుట) 3. ప్రసరణము (చాచుట) 4. ధావనము (వేగముగా పోవుట) 5. అకుంచనము (ముడుచుకొనుట).

పంచవిధ హేతువులు : 1. శరీరము 2. కర్త 3. కరణము 4. ప్రాణవ్యాపారము 5. దైవము.

# 6 షట్

షట్ అంగ దేవతలు : 1. సర్వజ్ఞ దే. - హృదయదేవత 2. నిత్యతృప్త దే. - శిరో దేవి 3. అనాది బోధ దే. - శిఖాదేవి 4. స్వతంత్రక దే. - కవచదేవి 5. అలుప్త దే. - నేత్రదేవి 6. అనంత దే. - అస్త్రదేవి.

,, అంగములు : 1. హృదయము 2. శిరస్సు 3. శిఖ 4. కవచము 5. నేత్రము 6. అస్త్రము (దేవిఉపాసన లోనివి).

,, అక్షరి : ఓం నమః శివాయ (షడక్షరి)

షడ్విధ అఖ్యాంత భక్తులు : 1. సద్భక్తి 2. వైష్ణవ భక్తి 3. అవదాన భక్తి 4. అనుభవ భక్తి 5. ఆనంద భక్తి 6. సమరస భక్తి.

,, అగ్నులు : 1. గార్హపత్య అ. 2. అహవనీయ అ. 3. దక్షిణ అ. 4. సభ్య అ. 5. అవసధ్య అ. 6. ఔపాసన అ.

,, అధ్వలు : 1. వర్ణము 2. పదము 3. మంత్రము 4. కలా 5. తత్త్వము 6. భువనము.

,, అనాది పదార్థములు : 1. బ్రహ్మము 2. ఈశ్వరుడు 3. జీవుడు 4. అవిద్య 5. భేదము 6. సంబంధము,

షడ్విధ అభిజ్ఞలు (మానవాతీత శక్తులు) : 1. దివ్యదృష్టి 2. దివ్యశ్రోత్రము 3. పూర్వనివాసాను స్మృతి 4. పరచిత్త జ్ఞానము 5. అప్రత్యక్ష విషయ జ్ఞానము 6. వియద్గమనాగమన వ్యూహాది లక్షణమైన బుద్ధి.

,, అర్థాధ్యాసలు : 1. కేవల సంబంధ అ. - అనాత్మపదార్థములతో ఆత్మకుగల తాదాత్మ్య సంబంధము 2. సంబంధి సహిత సంబంధి అ. - ఆత్మతో అనాత్మకుగల సంబంధము. 3. కేవల ధర్మ అ. - దేహేంద్రియములుకాక స్థూలదేహముయొక్క ఇంద్రియములయొక్క ధర్మములు మాత్రము ఆత్మయందు అధ్యస్తమగుట. 4. ధర్మసహిత ధర్మి అ. - అహంకారము యొక్క స్వరూపము, దాని ధర్మములు ఆత్మయందు అధ్యస్థమగుట. 5. అన్యోన్య అ. - ఆత్మయందు అనాత్మ పదార్థములకు స్వరూపము చేతను, అనాత్మ పదార్థములందు ఆత్మకు సంసర్గము చేతను కలుగునది. 6. అన్యతర అ. - ఆత్మ అనాత్మల రెంటియందు ఒకదాని యొక్క అధ్యాస ముండుట.

షట్ అరివర్గములు : 1. కామము 2. క్రోధము 3. లోభము 4. మోహము 5. మదము 6. మాత్సర్యము.

షడ్విధ అలంకార భూషితములు : 1. గుర్రమునకు వేగము 2. స్త్రీలకు లజ్జ 3. తపస్వులకు కార్శ్యము 4. బ్రాహ్మణునకు విద్య 5. గృహిణికి పాతివ్రత్యము 6. క్షత్రియునకు పరాక్రమము.

,, ఆతతాయులు : 1. అగ్నిదుడు - ఇంటికి నిప్పంటించువాడు 2. గరదుడు - విషము పెట్టువాడు 3. శస్త్రధారి - చంపుటకై అస్త్రమును పూనువాడు 4. ధనాపహర్త - ధనమును హరించువాడు 5. క్షేత్రాపహర్త - భూమిని అపహరించువాడు 6. భార్యాపహర్త - పరస్త్రీని అపహరించువాడు.

,, ఆత్మ ధర్మములు : 1. నిర్వికారత్వము - వికారములేనిది 2. అసంగత్వము - సంగము లేనిది 3. నిత్యత్వము - ఎల్లప్పుడు ఉండునది 4. స్వప్రకాశత్వము - తనంత తానే ప్రకాశించునది 5. అద్వితీయత్వము - రెండవది లేనిది 6. పరిపూర్ణత్వము - పూర్ణమైనది.

షడ్విధ ఆప్తధర్మ బంధువులు : 1. సత్యము - తల్లి 2. జ్ఞానము - తండ్రి 3. ధర్మము - సోదరుడు 4. దయ - మిత్రుడు 5. శాంతము - భార్య 6. క్షమ - పుత్రుడు.

,, ఈతి బాధలు : 1. అతివృష్టి 2. అనావృష్టి 3. శలభము (మిడుత) 4. మూషికము 5. శుకము (చిలుక) 6. అత్యాశసన్నిహితులగు రాజులు.

,, ఈశ్వర గుణములు : 1. సర్వజ్ఞత్వము 2. నిత్యతృప్తత్వము 3. అనాది బోధత్వము 4. స్వతంత్రతత్వము 5. అలుప్తశక్తిమత్వము 6. అనంతశక్తిమత్వము.

,, ఊర్ధ్వ లోకములు : 1. భువర్లోకము 2. స్వర్గలోకము 3. మహర్లోకము 4. జనలోకము 5. తపోలోకము 6. సత్యలోకము.

షట్ ఊర్మ్మలు (షడూర్మ్మలు) : (i) 1. ఆకలి 2. దప్పి 3. శోకము 4. మోహము 5. వార్ధక్యము 6. మరణము (ii) 1. చలి 2. వేడిమి 3. సుఖము 4. దుఃఖము 5. మానము 6. అవమానము.

,, ఋతువులు : 1. వసంత ఋ. 2. గ్రీష్మ ఋ. 3. వర్ష ఋ. 4. శరత్ ఋ. 5. హేమంత ఋ. 6. శిశిర ఋ.

షడ్విధ కంచుకములు : 1. మాయా కం. - అంధకార తత్త్వమున కలుగునది. 2. కాలానామ కం. - వాయుతత్త్వమున కలుగునది. 3. అవిద్యానామ కం. - తేజస్ తత్త్వమున కలుగునది. 4. రాగనామ కం. - పృధ్వీ తత్త్వమున కలుగునది 5. కాలనామ కం. - జలతత్త్వమున కలుగునది 6. సంకల్పనియతినామ కం. - ఆకాశ తత్త్వమున కలుగునది.

,, కర్మలు : (i) 1. యజనము - యజ్ఞములు చేయుట 2. యాజనము - యజ్ఞములు చేయించుట 3. అధ్యయనము - వేదశాస్త్రములు చదువుట 4. దానము - ఇతరులకు దాన ధర్మములు చేయుట 5. ప్రతిగ్రహణము - ఇతరులనుండి దానము స్వీకరించుట 6. అధ్యాపనము -

వేదములు ఇతరులకు నేర్పుట. (ii) 1. శాంతి - రోగాదుల నివారణ కొరకు 2. వశీకరణము - చెప్పినట్లు చేయుట 3. స్తంభనము - మనస్సు పనిచేయకుండుట 4. విద్వేషము - ప్రీతిగలవారలకు ప్రీతి 5. ఉచ్చాటనము - స్థాన భ్రష్టత 6. మారణము - ప్రాణహరణము

షడ్విధ కళ్యాణాంగములు : 1. సత్యము - యధార్థ వచనము 2. అనార్జవ - కుటిలత్వము లేకుండుట 3. దయ - కరుణ వర్తనము 4. దానము - దీనులకు అన్న వస్త్రాదులు ఇచ్చుట 5. అహింస - భూతదయ కలిగియుండుట 6. అభిద్య - చింత లేకుండుట.

,, కీర్తి కార్యములు : 1. పితృవాక్య పరిపాలన 2. మాతృవాక్య పరిపాలన 3. సత్యవ్రత పరిపాలన 4. దాన పరిపాలన 5. ఓర్పు పరిపాలన 6. పెద్దలు తలపెట్టిన కార్య పరిపాలన.

,, కోశములు : 1. చర్మము 2. రక్తము 3. మాంసము 4. మెదడు 5. క్రొవ్వు 6. ఎముకలు.

,, క్రియలు : 1. అంచిత 2. కుంచిత 3. అగ్రతల 4. సంచర 5. ఉద్ఘటిత 6. సమములు.

,, క్షేత్రజ్ఞ గుణములు : 1. ఉపద్రష్ట - సాక్షి 2. అనుమోదకుడు - అంగీకరించువాడు 3. భర్త - భరించువాడు 4. భోక్త - అనుభవించువాడు 5. మహేశ్వరుడు - సర్వాత్మకుడు, స్వతంత్రుడు 6. పరమాత్మ - అవిద్యచేత ప్రత్యగాత్మ రూపమున కల్పింపబడిన అన్నింటికిని అంతరాత్మ.

షట్ గుణ ఐశ్వర్యములు : (i) 1. మహాత్మ్యము 2. ధైర్యము 3. యశస్సు 4. శ్రీ (సంపద) 5. జ్ఞానము 6. వైరాగ్యము (ii) 1. ఐశ్వర్యము (మహాత్మ్యము) 2. సమగ్రత (ధర్మము) 3. వీర్యము 4. యశస్సు 5. వైరాగ్యము 6. మోక్షము. (iii) 1. జ్ఞానము - నిత్యా నిత్య వివేకముతో గూడిన చైతన్యాత్మక బోధకు సంబంధించినది. 2. ఐశ్వర్యము - స్వతంత్ర కర్తృత్వమునకు

సంబంధించినది. 3. శక్తి - బ్రహ్మయొక్క ప్రకృతి. దాని సర్వతో ముఖ భావము జగద్రూపమున ప్రకటిత మగుచున్నది. 4. బలము - సర్వమునకు అధిష్టానమైన భగవంతునకు ఎల్లప్పుడు క్రియలు నిర్వహించుచున్నను శ్రమలేక పోవుట. 5. వీర్యము - ఎల్లప్పుడు నిర్వికార స్థితిలో నుండి ఏ విధమైనమార్పు లేక యుండుట. 6.తేజస్సు - ఇతరుల సహాయము లేకయే సర్వక్రియలు చేయగలుగుట.

షట్ గుణములు : 1. సంధి 2. నిగ్రహము 3. యానము 4. ఆసనము 5. ద్వైదీభావము 6. సమాశ్రయము.

షడ్విధ గురువులు : 1. ప్రేరక గు. 2. సూచక గు. 3. వాచిక గు. 4. దర్శక గు. 5. బోధక గు. 6. శిక్షక గు.

,, చంచలములు : 1. యౌవనము 2. జీవితము 3. మనస్సు 4. ఛాయ 5. ధనము 6. ప్రభుత్వము.

షట్ చక్రములు : 1. మూలాధారము - గుదస్థానమున వుండునది. 2. స్వాధిష్ఠానము - లింగ లేక యోని స్థానమున వుండునది. 3. మణిపూరకము - నాభి స్థానమున వుండునది. 4. అనాహతము - వక్షస్థలమున వుండునది. 5. విశుద్ధము - కంఠస్థానమున వుండునది. 6. ఆజ్ఞ - భ్రూమధ్య స్థానమున వుండునది.

షడ్విధ జీవ జాతులు : 1. స్థావరములు 2. క్రిములు 3. జలచరములు 4. పక్షి జాతులు 5. మృగములు 6. మానవులు.

షట్ దర్శనములు (ఆస్తిక దర్శనములు) : 1. న్యాయ ద. - గౌతమ మహర్షి రచన 2. వైశేషిక ద. - కణాది మహర్షి రచన 3. సాంఖ్య ద. - కపిల మహర్షి రచన 4. యోగ ద. - పతంజలి మహర్షి రచన 5. పూర్వమీమాంస ద. - జైమిని మహర్షి రచన 6. ఉత్తర మీమాంస లేక వేదాంత ద. - వ్యాస మహర్షి రచన.

షడ్విధ దుఃఖ భాగులు : 1. ఈర్ష్యాళువు 2. జుగుప్సావంతుడు 3. నిస్సంతోషి 4. క్రోధనుడు. 5. నిత్యశంకితుడు 6. పర భాగ్యోప జీవి.

షడ్విధ ధర్మపత్నీ ధర్మములు : 1. గృహకృత్యములందు - దాసి 2. కార్యాలోచనమందు - మంత్రి 3. రూప సంపద యందు - లక్ష్మీ దేవి 4. ఓరిమియందు - భూదేవి 5. స్నేహమునందు - తల్లి 6. కూటము యందు - వేశ్య (వలె ప్రవర్తించవలెను).

,, ధర్మములు (సన్యాసులవి) : 1. అజిహ్వాత్వము - లభ్యమైన ఆహారము ఇష్టా యిష్టములను గురించి తలపకుండుట. హితముగ మితముగ సత్యమును మాట్లాడుట. 2. షండత్వము - యౌవనస్త్రీయందు కామ వికారము చెందకుండుట. 3. పంగుత్వము - భిక్షాన్నము, ఇతర అవసరముల కొరకు యోజనము కంటె ఎక్కువ దూరము పోకుం డుట. 4. అంధత్వము - ఎప్పుడును పదహారు మూరల కంటె ఎక్కువ దూరము చూడకుండుట. 5. ముగ్ధత్వము - విషయములు అనుభవించుటకు సామర్థ్యము కలిగికూడ విషయ భోగములందు ప్రవర్తింపకుండుట 6. బధిరత్వము - వినకూడని విషయములు వినకుండుట.

,, ధర్మాంగములు : 1. దేశము 2. కాలము 3. పదార్థము 4. కర్త 5. మంత్రము 6. కర్మము.

,, దోష గుణములు : 1. నిద్ర 2. మత్తు 3. భయము 4. కోపము 5. సోమరితనము 6. మంచి పనిని వెంటనే చేయక ఆలస్యము చేయుట.

,, నష్టములు : 1. ధనము పోవుట 2. ధాన్యము నశించుట 3. మిత్రులు దూరమగుట 4. పనులు కోల్పోవుట 5. భార్య మరణించుట 6. ఇల్లు కాలి పోవుట.

,, నాశన కార్యములు (చేయరాని పనులు) : 1. జూదము 2. పరస్త్రీ వ్యామోహము 3. పగ 4. వంచన 5. పరద్రవ్యాశ 6. అహం కారము.

,, నాస్తిక దర్శనములు : 1. చార్వాకము 2. జైనము 3. మాధ్య మికము. 4. యోగాచారము 5. సౌత్రాంతికము 6. వైభాషికము (చివరి నాలుగు బౌద్ధ దర్శనములు).

షడ్విధ నిషిద్ధ శేషములు : 1. అగ్ని 2. ఋణము 3. వ్యాధి 4. శత్రువు 5. సంశయము 6. వాసన.

షట్ పదార్థములు : 1. ద్రవ్యము 2. గుణము 3. కర్మము 4. సామాన్యము 5. విశేషము 6. సమవాయము.

షడ్విధ పరమాత్మ అంశములు : 1. బ్రహ్మము - నాశరహితము సర్వోత్కృష్టమగు ఆత్మ. 2. అధ్యాత్మము - బ్రహ్మము యొక్క జగద్రూప్యమును ప్రకటించు స్వభావము. 3. కర్మము - భూతజాలమును వుత్పత్తిజేయు వ్యాపారము 4. అధిభూతము - నాశవంతమగు వుపాధులు. 5 అధిదైవము - పర ప్రకృతియగు పురుషుడు. 6. అధియజ్ఞము - శరీరమున అంతర్యామి రూపమున వెలయునట్టిది.

షట్ పారమితులు : 1. దానము 2. శీలము 3. వీర్యము 4. క్షాంతి 5. ధ్యానము 6. ప్రజ్ఞ.

షడ్విధ పూర్వాగోచర కార్యములు (ఎప్పుడు సంభవించునో తెలియనివి) : 1. గుర్రపుదాటు 2. మేఘుని ఉరుము 3. స్త్రీల మనస్సు 4 పురుషుని భాగ్యము 5. వర్షము రాకపోకలు 6. జీవుని మరణము.

షట్ ప్రజాపతులు (బ్రహ్మ మానస పుత్రులు) : 1. మరీచి 2. అత్రి 3. అంగీరసుడు 4. పులస్త్యుడు 5. పులహుడు 6. క్రతువు.

షడ్విధ ప్రమాణములు : 1. ప్రత్యక్షము 2. అనుమానము 3. శ్రుతి 4. ఉపమానము 5. అర్థాపత్తి 6. అనుపలబ్ధి.

,, ప్రయోగములు : 1. శాంతి 2. వశీకరణము 3. స్తంభనము 4. విద్వేషణము 5. ఉచ్చాటనము 6. మారణము.

,, బుద్ధి భేదములు : 1. పంద 2. మేధ 3. చార్వి 4. గృహీతి 5. క్షాంతి 6. చత్వం.

షడ్విధ భక్త ప్రవృత్తులు : 1. మనస్సు దైవమందు లగ్నమొనర్చుట 2. మానసిక వ్యాపారములను దైవమున కర్పించుట 3. పరస్పరము

ప్రబోధమైనర్చు కొనుట 4. సదా దైవకథలే ప్రసంగించుట 5. సంతుష్టులై యుండుట 6. అతిశయానందము నొందుట.

షడ్విధ భక్తులు : 1. శైవులు - శివుని యారాధించువారు 2. వైష్ణవులు - విష్ణువు నారాధించువారు 3. సౌరులు - సూర్యునారాధించువారు 4. శాక్తేయులు - శక్తినారాధించువారు 5. గాణాపత్యులు - గణపతి నారాధించువారు 6. కాపాలికులు - కపాలముల నారాధించువారు.

షట్ భావవికారములు (i) 1. గర్భమునందుండుట 2. పుట్టుట 3. పెరుగుట 4. పరిణామము చెందుట 5. క్షీణించుట 6. నశించుట (ii) 1. కామము 2. క్రోధము 3. లోభము 4. మోహము 5. మదము 6. మాత్సర్యము. (iii) 1. రాగము 2. ద్వేషము 3. ఈర్ష్య 4. అసూయ 5. దంభము 6. అహంకారము.

షడ్విధ భ్రమలు : 1. కులము 2. గోత్రము 3. జాతి 4. వర్ణము 5. ఆశ్రమము 6. రూపము.

,, మంత్ర ప్రయోగములు : 1. వశ్యము - తనకు స్వాధీనము చేసికొనుట 2. మారణము - తాను ఒకరి చావుకై జపమొనర్చుట 3. స్తంభనము - కదల మెదలలేకుండుటకు జపమొనర్చుట 4. సంమోహనము - మోహించుటకు జపము చేయుట 5. ఉచ్చాటనము - పిశాచాదులు వెడల గొట్టుటకు జపించుట 6. ఆకర్షణము - పిశాచాదులు వచ్చునట్లు జపించుట.

,, మనోగుణములు : 1. త్వక్ 2. చక్షు 3. శ్రోత్ర 4. జిహ్వా 5. ఘ్రాణ 6. మనో రూపములు.

,, మనుష్యానందములు : 1. యౌవనము 2. సన్మార్గము 3. ధైర్యము 4. బలము 5. అధికారము 6. చక్రవర్తి పదవి.

,, మాయ నామధేయములు : 1. అవిద్య 2. మాయ 3. అజ్ఞానము 4. ప్రకృతి 5. శక్తి 6. అనిర్వచనీయము.

షడ్విధ ముక్తులు : 1. సాక్షిత్వము 2. సాలోక్యము 3. సారూప్యము 4. సామీప్యము 5. సాయుజ్యము 6. కైవల్యము.

,, యోగ సిద్ధి ప్రదములు : 1. ఉత్సాహము 2. సాహసము 3. ధైర్యము 4. తత్త్వజ్ఞానము 5 నిశ్చయము 6. జనసంగ పరిత్యాగము.

షట్ రసములు : 1. కషాయము 2. మధురము 3. లవణము 4. కటువు 5. తిక్తము 6. ఆమ్లము.

షడ్విధ రసోపేత భోజన పదార్థములు : 1. అన్నము 2. కూరలు 3. పచ్చళ్లు 4. నేయి 5. పులుసు 6. మజ్జిగ

,, లక్ష్యములు : 1. స్థూలము 2. సూక్ష్మము 3. కారణము 4. మహాకారణము 5. సమరసము 6. వ్యక్తము.

,, వాదములు : 1. సత్ఖ్యాతి 2. అసత్ఖ్యాతి 3. అనిర్వచనీయ ఖ్యాతి 4. అన్యధాఖ్యాతి 5. ఆత్మఖ్యాతి 6. అఖ్యాతి వాదములు.

,, విద్యలు : 1. ఆకర్షణము 2. స్తంభనము 3. మారణము 4. విద్వేషణము 5. ఉచ్చాటనము 6. మోహనము.

షట్ వేదాంగములు : 1. శిక్ష - వేదములలోని శబ్దములయొక్క ఉచ్చారణ రీతిని బోధించునది. 2. కల్పము - వేద విహితమైన కర్మకలాపములను ఆచరించు రీతిని తెలుపునది. 3. వ్యాకరణము - శబ్దములలోని పద స్వరూపమును నిష్కృష్టముగా చెప్పునది. 4. నిరుక్తము - శబ్దముల అర్థ విశేషమును నిర్వచించి వివరించునది. 5. ఛందస్సు - వేద మంత్రములలోని మాటలలో గల అక్షరములకు కూర్పును బోధ పరచునది. 6. జ్యోతిషము - వేద విహిత కర్మకలాపములకు ఆచరింపదగిన కాలమును నిర్ణయించునది.

షడ్విధ వేదాంతవాది మతములు : 1. భాస్కరీయ 2. శబ్దబ్రహ్మవాద 3. క్రీడా బ్రహ్మవాద 4. ద్వైత 5. శుద్ధాద్వైత 6. విశిష్టాద్వైత సిద్ధాంతములు.

షడ్విధ వైదిక విధి ప్రమాణములు : 1. శ్రుతి 2. లింగ 3. వాక్య 4. ప్రకరణ 5. స్థాన 6. సమాఖ్యలు.

షట్ శమాదులు (శమాది షట్కము) : 1. శమము - అంతరింద్రియ నిగ్రహము 2. దమము - బాహ్యేంద్రియ నిగ్రహము 3. ఉపరమము - స్వధర్మానుష్ఠానము 4. తితిక్ష - ద్వంద్వములకు అతీతుడుగా నుండుట 5. శ్రద్ధ - గురువేదాంత వాక్యములందు విశ్వాసము 6. సమాధానము - చిత్తైకాగ్రత.

,, శాస్త్రములు : 1. న్యాయశాస్త్రము 2. ధర్మశాస్త్రము 3. నీతిశాస్త్రము 4. అర్థశాస్త్రము 5. మీమాంస 6. పురాణము.

,, శ్రుతి లింగములు (షడ్లింగములు) : 1. (అ) ఉపక్రమము - అద్వితీయ బ్రహ్మప్రకరణము యొక్క ఆదిలో ప్రతిపాదింపబడుట (ఆ) ఉపసంహారము - అద్వితీయ బ్రహ్మ ప్రకరణము యొక్క అంతములో ప్రతిపాదించబడుట 2 అభ్యాసము - ప్రకరణముచే ప్రతిపాదింపబడిన అద్వితీయ బ్రహ్మప్రకరణ మధ్యమములో మరల మరల వర్ణింపబడుట. 3. అపూర్వత - అద్వితీయ బ్రహ్మ శ్రుతి కంటె వేరైన ప్రత్యక్షాది లౌకిక ప్రమాణములకు అవిషయముగా నుండుట. 4. ఫలము - ప్రకరణముచేత ప్రతిపాదితమగు బ్రహ్మము యొక్క జ్ఞానము వలన శ్రుతిచేత చెప్పబడిన ఆ బ్రహ్మవస్తువు యొక్క ప్రాప్తి రూపప్రయోజనము. 5. అర్థవాదము - (అ) స్తుతి రూపమగు అర్థవాదము - ప్రకరణముచేత ప్రతిపాదితమగు అద్వితీయ బ్రహ్మము యొక్క స్తుతిరూపమైన ప్రశంసనము. (ఆ) నిందాపరమగు అర్థవాదము - ఆ యద్వితీయ బ్రహ్మమున కంటె భిన్నమగు ద్వైత నిరసనము. 6 ఉపపత్తి - ప్రకరణముచేత ప్రతిపాదితమగు అద్వితీయ బ్రహ్మ వస్తువును అనేక దృష్టాంతముల చేతను యుక్తుల తోడను ప్రతిపాదించుట.

షడ్విధ సంసార సాగర తరంగములు : 1. జననము 2. మరణము 3. క్షుధ 4. తృష్ణ 5. హర్షము 6. శోకము.

షడ్విధ సద్గుణములు : 1. దయ 2. ఋజుత్వము 3. సత్యము 4. ఇంద్రియ జయము 5. శమము 6. శౌచము.

,, సనాతన ధర్మములు : 1. ఏకపత్నీ వ్రతము 2. ఏకాదశవ్రతము 3. పాతివ్రత్యము 4. అతిధి అభ్యాగత పూజనము 5. దానధర్మములు 6. ప్రపత్తి.

,, సన్యాసులు : 1. కుటీచకుడు - తీర్థయాత్రలుచేయుటకు అసమర్థుడై మఠము కట్టుకొని ఉండువాడు. 2. బహూదకుడు - తీర్థయాత్ర చేయువాడు. 3. హంస - కుటీచక బహూదక మార్గముల రెండింటి యందును వుండి, ఏకదండి శిఖను వర్జించి, యజ్ఞోపవీతము నుంచు కొని, శిఖ్యకమండలధారి, కృచ్ఛచాంద్రాయణవ్రతుడు, ఏకభుక్తు డుగా నుండువాడు. 4. పరమహంస - ఏకదండి, శిఖాయజ్ఞోపవీత - విరహితుడు, కౌపీన కాషాయ వస్త్రధారి, సర్వకర్మ వివర్జితుడు, ఆత్మ నిష్ఠుడుగా నుండువాడు. 5. తురీయాతీతుడు - ఆరూఢుడైన వాడు. 6. అవధూత - వర్ణాశ్రమములను విడచి ఆత్మవిచారము నందుండు వాడు.

,, సమాధులు : 1. బాహ్యదృశ్యానువిద్ధ సవికల్ప స - బాహ్యదృశ్య ములు పరబ్రహ్మజన్యములని అట్టి పరబ్రహ్మ తానేయను యను భూతి పొందుట. 2. బాహ్యశబ్దానువిద్ధ సవికల్ప స. - బాహ్యశబ్దములు తాను కానని తాను పరబ్రహ్మ స్వరూపమని భావించు స్థితి. 3. అంతరదృశ్యానువిద్ధ సవికల్ప స. - అంతరమైన కామాది వృత్తులు తాను కానని వానికి విలక్షణమైన పరబ్రహ్మయే తానని భావించుస్థితి. 4. అంతరశబ్దానువిద్ధ సవికల్ప స. - రాగద్వేషాది అంతర్వికార ముల నామములు తాను కానని, వానికి విలక్షణుడైన పరబ్రహ్మయే తానని భావించు స్థితి. 5. బాహ్యనిర్వికల్ప స.- పై నాలుగు సవికల్ప సమాధుల యందు స్థిరత్వము పొంది బాహ్యాంతరములందు తన కంటె అన్యమేమియు తోచక శూన్యమైనట్లుండుట. 6. అంతర నిర్వి కల్ప స. - పై అయిదు సమాధులలో పేర్కొనబడిన వృత్తులేవియు

లేక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమై యుండుట.

షడ్విధ సాధనలు : 1. భోగత్యాగము 2. సకలవాంఛారాహిత్యము 3. శమము 4. దమము 5. ప్రయత్నము 6. యధార్థాన్వేషణ.

,, సేవాంగములు : 1. నమస్కారము 2. స్తుతి 3. కర్మ సమర్పణ 4. సంసేవ 5. పాదధ్యానము 6. కథాశ్రవణము.

,, స్తోత్ర లక్షణములు : నమస్కార స్తదాశీశ్చ సిద్ధాంతోక్తిః పరాక్రమః విభూతిః ప్రార్థనాచేతి షడ్విధం స్తోత్ర లక్షణమ్.

,, స్పర్శలు : 1. శీతము 2. ఉష్ణము 3. శీత మిశ్రము 4. ఉష్ణమిశ్ర శీతము 5. మృదువు 6. కఠినము.

# 7. సప్త

సప్తవిధ అక్షర బ్రహ్మ విశేషణములు : 1. అనిర్దేశ్యము - ఇట్టిదని వర్ణించుటకు శక్యముకానిది. 2. అవ్యక్తము - వస్తునిర్ణయ లక్షణములతో తెలియబడనిది 3. సర్వత్రగము - అంతటను వుండునది. దేశకాల వస్తుగత పరిచ్ఛేదములు లేనిది 4. అచింత్యము - ఇట్టిదని చింతించుటకు అలవి కానిది. 5. కూటస్థము - స్థిరమైనది. 6. అచలము - చలనము లేనిది. 7. ధ్రువము - నిర్వికారమైనది.

సప్త అజ్ఞాన భూమికలు : 1. బీజ జాగ్రత్త - అవిభక్తమైన సుషుప్తి అవస్థను వదలి జాగ్రత అవస్థకు వచ్చుటకు పూర్వముండు స్థితి. 2. జాగ్రత్త - అవ్యక్తమైన తెలివికి ముందులేని భేదమును, సూక్ష్మమును కలిగి విశ్వాభి ముఖము చెందుట ('నేను, నాపేరు' మొదలైన అజ్ఞాన కృత అహంకారము కలిగినది) 3. మహాజాగ్రత్త - పూర్వజన్మ కర్మము వలన కలిగిన మెలకువతో కార్యములలో ప్రవేశించుట లేక ఆసక్తి కలిగియుండుట. 4. జాగ్రత్స్వప్నము -

జాగ్రత్తలో ఇదివరకు చూచిన వినిన విషయములను గాఢముగా చింతన చేయుచు తన్మయుడై యుండుట. 5. స్వప్నము - జాగరములో కల్పిత స్వరూపమును చూచుట. 6. స్వప్న జాగ్రత్ - మరచిపోయిన వాటిని తలచుకొనుట. 7. సుషుప్తి - ఆత్మ ప్రతిబింబమైన జగత్తులోని విషయ సుఖములలో మునుగుట. గాఢనిద్ర.

సప్త అగ్ని జిహ్వలు (i) : 1. కాళి 2. కరాళి 3. మనోజవ 4. సులోహిత 5. సుధూమ్రవర్ణ 6. స్ఫులింగిని 7. విశ్వరూపి. (ii) 1. కరాలి 2. ధూమిని 3. శ్వేత 4. లోహిత 5. నీలరోహిత 6. సువర్ణ 7. పద్మరాగ అగ్ని జిహ్వలు.

సప్తవిధ అతిచ్ఛందస్సులు (వేదములలోనివి) : 1. అతిజగతి 2. శక్వరి 3. అతిశక్వరి 4. అష్టి 5. అత్యష్టి 6. ధృతి 7. అతిధృతి.

సప్త అధోలోకములు : 1. అతలము 2. వితలము 3. సుతలము 4. తలాతలము 5. రసాతలము 6. మహాతలము 7. పాతాళము.

సప్తవిధ అమనస్క అంగములు : 1. త్యాగము 2. మౌనము 3. దేశము 4. కాలము 5. మూలబంధము 6. దేహసమత్వము 7. దృష్టి స్థితి.

,, ఆత్మావస్థలు : 1. అజ్ఞానము 2. ఆవరణము 3. విక్షేపము 4. పరోక్షజ్ఞానము 5. అపరోక్షజ్ఞానము 6. దుఃఖ నివృత్తి 7. తృప్తి.

,, ఆవరణములు : 1. దుఃఖము 2. శరీర పరిగ్రహము 3. కర్మములు 4. రాగద్వేషాదులు 5. అనుకూల ప్రతికూల జ్ఞానములు 6. ద్వైత ప్రపంచభ్రాంతి 7. అజ్ఞానము.

సప్త ఊర్ధ్వ లోకములు : 1. భూలోకము 2. భువర్లోకము 3. సువర్లోకము 4. మహర్లోకము 5. జనలోకము 6. తపోలోకము 7. సత్యలోకము.

,, ఋషి భేదములు : 1. మహర్షులు (వ్యాసాదులు) 2. పరమర్షులు (భేలాదులు) 3. దేవర్షులు (నారదాదులు) 4. బ్రహ్మర్షులు (వసిష్ఠాదులు) 5. శ్రుతర్షులు (సుశ్రుతాదులు) 6. రాజర్షులు (ఋతుపర్ణాదులు) 7. కాండర్షులు (జైమిన్యాదులు).

సప్త ఋషులు : 1. కశ్యపుడు 2. అత్రి 3. భరద్వాజుడు 4. విశ్వామిత్రుడు 5. గౌతముడు 6. జమదగ్ని 7. వసిష్ఠుడు.

సప్తవిధ కవులు : 1. వివేకి 2. వాచకుడు 3. రోచికుడు 4. అర్థి 5. శిల్పకుడు 6. భూషణార్థి 7. మార్దవానుగతుడు.

,, కళలు (శరీర సంబంధమైనవి) : 1. మాంసము 2. రక్తము 3. మేదస్సు 4. యకృత్ ప్లీహములు 5. నరములు 6. జఠరాగ్ని 7. శుక్రము.

,, కిరణములు : 1. సుషుమ్న 2. హరికేశ 3. విశ్వకర్మ 4. విశ్వశ్రవ 5. సంయద్వము 6. ఆర్యావసు 7. స్వరత్.

సప్త కుల పర్వతములు : (i) 1. ఉదయ 2. అస్త 3. హిమ 4. వింధ్య 5. మేరు 6. త్రికూట 7. లోకాలోక పర్వతములు (ii) 1. మహేంద్రము 2 మలయము 3. సహ్యము 4. శుక్తిమంతము 5. ఋక్షము 6. వింధ్యము 7. పారియాత్రలు.

,, కుశ ద్వీపములు : 1. ధూతపాప ద్వీ. 2. శివ ద్వీ. 3. పవిత్ర ద్వీ. 4. సమ్మతి ద్వీ. 5. విద్యుత్తు ద్వీ. 6. మహి ద్వీ. 7. చాన్య ద్వీ.

సప్తవిధ కృతి ఛందస్సులు (వేదములలోనివి) : 1. కృతి 2. ప్రకృతి 3. ఆకృతి 4. వికృతి 5. సంకృతి 6. అభికృతి 7. ఉత్కృతి.

,, క్షత్రియ లక్షణములు : 1. శౌర్యము 2. తేజస్సు 3. ధృతి 4. దక్షత 5. అపలాయనము 6. యోగ్యత ఎరిగి యీవి కలిగి యుండుట 7. దర్పమునకు తలయొగ్గని స్వాతంత్ర్య భావము.

,, క్షత్రియ సహజ కర్మలు : 1. పరాక్రమము 2. ప్రకాశము 3. ధైర్యము 4. కార్యదక్షత 5. రణమందు స్థైర్యము 6. దానము 7. రాజరికము (అధికారము).

,, క్షేత్ర వికారములు : 1. ఇచ్ఛ 2. ద్వేషము 3. సుఖము 4. దుఃఖము 5. సంఘాతము (అనేక వస్తువుల కూడికతోనైన సాము దాయక రూపము) 6. చేతన 7. ధృతి.

సప్త గంగలు : 1. గంగ 2. గౌతమి 3. కావేరి 4. తామ్రపర్ణి 5. సింధు 6. సరయు 7. నర్మద.

సప్తవిధ గృహస్థాశ్రమ ధర్మములు : 1. ధర్మము 2. అర్థము 3. కామము 4. మోక్షము 5. సంతాన సుఖము 6. యశస్సు 7. ఉత్తమ లోక ప్రాప్తి.

సప్త గ్రహములు : 1. సూర్యుడు 2. చంద్రుడు 3. అంగారకుడు 4. బుధుడు 5. గురుడు 6. శుక్రుడు 7. శనైశ్చరుడు.

,, జ్ఞాన భూమికలు : 1. శుభేచ్ఛ-సాధన చతుష్టయ సంపన్నుడు సద్గురునిచేరి షడ్లింగ సహితముగా వేదాంత శాస్త్రమును శ్రవణము చేయుట. 2. విచారణ - ఆ శ్రవణము చేసిన అర్థమును జీవబ్రహ్మల యభేదసాధకములైన యుక్తులచేత, భేద బాధకములైన యుక్తులచేత మననము చేయుట. 3. తను మానన - అనాత్మక విషయ అంతఃకరణ వృత్తులను నిరోధించి అవిచ్ఛిన్న తైలధారవలె ఆత్మధ్యానము కలిగియుండుట. (పై మూడు బ్రహ్మ సాక్షాత్కారమునకు సాధనా రూపములు. మిగిలిన నాలుగు ఫల రూపములు) 4. సత్త్వాపత్తి - దీని యందున్నవాడు 'బ్రహ్మవిదుడు'. ఆత్మ సాక్షాత్కారమును పొందిన తరువాత కూడ జగత్తును మిథ్యాదృష్టితో చూచుచు వినోదించుచుండును. 5. అసంసక్తి - దీనియందున్నవాడు 'బ్రహ్మ విద్వరుడు'. బ్రాహ్మీస్థితిలో నుండి కూడ ప్రారబ్ధానుసారము లభించిన పదార్థములను శరీర పోషణకు కావలసిన వానిని అనుభవించుచుండును. 6. పదార్థ భావన - దీని యందున్నవాడు 'బ్రహ్మ విద్వరుడు'. దేహావసరాలైన కార్యములకు కూడ స్వయంగా మేల్కొనక నిరంతర బ్రహ్మనిష్ఠలో నుండును. భక్తులచే మేల్కొలుపబడినప్పుడు మాత్రమే లేచి వారి సహాయముతో ఆహారము తీసికొని తిరిగి నిర్వికల్ప సమాధిలోనికి వెళ్ళును. 7. తుర్యగ - దీనియందున్నవాడు 'బ్రహ్మ విద్వరిష్ఠుడు'. తాను స్వయముగాగాని ఇతరుల వలనగాని మేల్కొలుపబడక నిరంతరము నిర్వికల్ప సమాధిలో నుండును. ఇతని శరీరము పరమేశ్వర ప్రేరితముగా నిలిచియుండును.

